# CHITRALEKHANAMU

## A TREATISE ON PAINTING

BY

T. RAMA ROW,

JEYPORE.

---

MADRAS:

V. RAMASWAMY SASTRULU & SONS

192, ESPLANADE.

1918.



# చిత్రలేఖనము.

గ్రంథకర్త:—

తలిసెట్టి. రామారావు,

జయపురము.

---

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము.

 1918. [*Price Rs. 1-4-0.*

# అంకితము.



ఈ నా గ్రంథమును

నాకు విద్యాబుద్ధులం గఱపిన మద్గురువర్యులగు

మ. రా. రా. శ్రీ.,

గోడవర్తి రామదాసుపంతులు,

B.A., గారికి

వినయపూర్వకముగ

సమర్పించుచున్నాను.

# విషయసూచిక.

**BOOK I.** పు

## ప్రథమ భాగము.



## రెండవ భాగము.



## మూఁడవ భాగము.



## నాల్గవ భాగము.



## ఐదవ భాగము.



**BOOK II.**

## ప్రథమ బాగము.



## రెండవ భాగము.



## మూఁడవ భాగము.



## నాల్గవ భాగము.



## ఐదవ భాగము.

# చిత్రలేఖనము.

## BOOK I.

## ప్రథమభాగము.

### ―― మొదటి ప్రకరణము. ――

బాలురు చిత్రలేఖనమునందు మిగుల శ్రద్ధ వహించెదరు; కాని వీరియం దీగుణమును వృద్ధి పొందించుటకు పెద్దలేమియు ప్రయత్నింపలేదు. దీనిని వృద్ధి పొందించినయెడల మా దేశములో చాలమంది చిత్రలేఖకులు వెలువడెదరు.

చిత్రలేఖన మనేకవిధములఁ జరుగుచుండును. పెన్సిలు, కణిక (Crayon), నుసిబొగ్గు, రంగులు, కుంచెలు, కలము మొదలగునవి యుపయోగించి చిత్రములను వ్రాయవచ్చును. కాగితమును బొమ్మరూపముగ కత్తిరింపవచ్చును. మట్టితో ప్రతిమలను చేయవచ్చును. రాతిమీఁదను బొమ్మలను చెక్కవచ్చును.

మనస్సున పుట్టినయుద్దేశమును మనము పైనిచెప్పిన పరికరములు నుపయోగించి పైకి కనపఱుపవచ్చును. ఒక పిల్లి చాపమీఁదను పండుకొనియున్నట్లు మన మనస్సునం దూహించి దానిని కాగితముమీఁద పెన్సిలుతో వ్రాయవచ్చును. రంగులతో చిత్రింపఁగలము. కత్తెరతో కాగితమును కత్తిరింపవచ్చును. కత్తితో కఱ్ఱమీఁదను చెక్కవచ్చును.

బాలురకు నేర్పించుటయందు పెన్సిలును, రంగులను, సాధారణముగ నుపయోగించెదరు.

ఒకబొమ్మనుచూచి వ్రాయుట చాల చెడ్డది. దీనికి బదులు నిజమైన వస్తువును బాలుని చేతికిచ్చి వ్రాయించుట మంచిది. చేయి మనస్సుయొక్క నౌకరి. అందువలన మనసున పుట్టిన యుద్దేశమునే వ్రాయించుట యుత్తమము.

ఈదిగువ నుదహరించినప్రకారము బాలురకు నేర్పిన చాల మంచిది. బాలురు రాఁదలఁచినవి వ్రాయించిన వారి కత్యానందము కలుగును. చిత్రలేఖనమునం దభిరుచి కలుగును. 1—1 చూడుము.

ఈ చిత్రములయందు బాలురకును పెద్దవారికిని భేదము తెలుసుకొనవలెను. బాలురకు దేహమును పట్టిచూచిన శిరస్సు పెద్దదిగనుండును. పెద్దవారికి చిన్నదిగ నుండును. 1—2 చూడుము.

ఇం దభ్యాసమైనతర్వాత మనుజు లేదైనపనిని చేయుచున్నట్టుల వ్రాయింపవలయును.

1



2



☞ ఇందు మొదటిసంఖ్య పటము (Plate) యొక్క సంఖ్య. రెండవసంఖ్య చిత్తరువు (Figure) యొక్కది.

*N. B.*—పై నుదహరించిన **3**—3 & 4 సంఖ్యలవి. వ్రాయుట చాల కష్టమైనపని. వీనియందు బాలురకు చాల యభ్యాస ముండవలెను. మొదట ఎడమచేతితోను తరువాత కుడిచేతితోను వ్రాయించుచుండవలెను. అనేక వస్తువుల నొకపర్యాయము వ్రాయుటకంటె నొక వస్తువునే యనేకపర్యాయములు వ్రాయుట చాల లాభకరము.







వ్రాయుటయందు [illegible] కలిగినగాని అభివృద్ధి [illegible] జాలదు. అందువలన నీదిగువ చెప్పినవి వ్రాయింపవలయును.

**4**—[illegible]ము.









4

## మూఁడవ ప్రకరణము.

వస్తువులన్నియు మనకు సమదూరములందుండవు. కొన్ని దూరముగ నుండును. మఱికొన్ని దగ్గఱగ నుండును. దూరముగ నున్నవి చిన్నవిగ కనబడును. దగ్గఱ నున్నవి పెద్దవిగ కనబడును. ఇట్టిసమయమున వ్రాయుటయందు మిగుల జాగరూకతతో నుండవలెను.










5



సమానమైన చెండులను తీసుకొని టేబిలుమీఁదనో, నేలమీఁదనో యుంచి వ్రాయవలెను. ఇంకొక సంగతి. దూరమున నున్నవానిని కొంచెమెత్తు ప్రదేశమునందు వ్రాయవలెను. **5**—1 చూడుము.

కొన్ని వస్తువులు పెద్దవిగను మఱి కొన్ని చిన్నవిగ నుండును. **5**—2 చూడుము.

మనుష్యునికంటె గడ్డికుప్ప పెద్దదిగ నుండును. అట్టి సమయమునందు గడ్డికుప్ప దూరముగ నుండినను పెద్దదిగ కనబడును. చాల దూరముగ నుండిన చిన్నదిగ కనబడును.

**5**—3 & 4 చూడుము.

ఒకవస్తువు ముందు మఱియొకవస్తువుండిన వెనుక నున్నవస్తువు కొంతవఱకే కానబడును. ముందున్న వస్తువు పూర్తిముగ కనబడును. **5**—5 చూడుము.

**5**

## ఐదవ ప్రకరణము

వెనుకనున్న వస్తువు దాని ముందున్నదానిచే కొంత కప్పఁబడునని యిదివరకే చెప్పియుంటిమి. ఇది అన్నివిషయములందును నిజముకాదు. అద్దముయొక్క వెనుకనున్న వస్తువుకూడ కనఁబడును. కాని అద్దమును వ్రాయుటయందో కష్టమున్నది. దానియందు ప్రకాశము ప్రతిఫలించును.

8—1 చూడుము.

చంచలము లేని నీటియందు నీడ చూచుట కష్టము. దానియొక్క కన్నను మాటిమాటికి వస్తువు నుంచి నీ రచట నున్నట్లు కనఁబడునట్లు వ్రాయును.

8—2 చూడుము.









8—2 సంఖ్యగల బొమ్మలో నొక చెఱువున్నట్లు సులభముగ తెలియును. పేపరుపై గీయునప్పుడు కాని నీటిపక్షు లేదినప్పుడు కాని నీటిని చంచలింపఁజేయును. ఇట్లు వ్రాసిన యచ్చట నీ రున్నట్లు స్పష్టముగ తెలియును.

కొన్ని సమయములయందు దిట్టముగా లేనప్పటికిని నీటియొక్క చలనమునుబట్టి అచ్చట జలమున్నట్లు తెలియును.

సూర్యుని వెలుతురునుబట్టి వస్తువుల రంగు మారుచుండును. తీవ్రముగా నెండ కాయుచున్నప్పుడును, మబ్బు వేసినప్పుడును, రాత్రియందును వివిధవిధముల వస్తువులు కానఁబడుచుండును.

8

## ఆఱవ ప్రకరణము.

పక్షులకును బుఱ్ఱ, కాళ్లు, మొదలగునవి యుండును; కాని వానియొక్క రూపములనుబట్టి యిదికాకి, ఇది కోడి యని చెప్పఁగలము.

8—3 చూడుము.

పక్షుల పాదములు వాని దేహములకు సమానముగా మధ్య నుండును. లేనియెడల పక్షి పడిపోవును. అది యేమిపని చేయుచున్నదో తెలియఁజేయునట్లు వ్రాయవలెను. 9—1 చూడుము.



తోఁక కొన్ని సమయములయందు మీఁది కెత్తియుండును. మఱికొన్ని సమయములయందు దించి యుండును. ఎగురునప్పుడు ఱెక్కలనేకవిధముల నుండును. పక్షుల పటములు వ్రాయుటయందు దీనివిషయమై మిగుల జాగ్రత్తతో నుండవలెను. 9—2 చూడుము.





ఒక్కొక్కజంతువునకు నొక్కొక్కస్వభావ ముండును. పెంపుడుపిల్లి ఎలుకను పట్టునటుల వ్రాసిన నసంబద్ధముగా నుండును. కనుక దేని స్వభావమును చూపుచు దానిని వ్రాయవలెను. 9—3; 10 చూడుము.





# రెండవ భాగము.

## మొదటి ప్రకరణము.

మనము మేడైనవస్తువును చూచి వ్రాయునపుడు మన దృష్టిమట్టమునుబట్టి దానియొక్క రూపు మారుచుండును. ఈవిధమైన చిత్రలేఖనము నభ్యసించుటకు మనము మొదట నొకపెట్టెను తీసికొనవలెను. దానిని మనము కొంత దూరమునుండి వ్రాయుట ప్రారంభింపవలయును.

**11**—చూడుము.




“క, ఖ” అనుగీత మనదృష్టికి సమానముగనున్న దనుకొందము. మనచూపు “గ” అను చుక్కమీదికి బరుగుచుండును. 1వ నెంబరు గీతలన్నియు “గ” వద్ద కలియును. 2, 3 నంబరులగీతలు సమానముగా గనఁబడును. ఈపెట్టె మనదృష్టిమట్టమునకు దిగువ నున్నది గనుక దీనిపైభాగము మనకుఁ గనఁబడుచున్నది. సమానముగనున్నయెడల రెండువైపులే కనఁబడును. మీఁదిభాగమును, ఎదుటిభాగమును కనఁబడును.

ఈక్రిందిపెట్టె మనదృష్టికి కొంచెముదిగువను, ప్రక్కను నున్నది. అందువలన మూఁడువైపులుకనఁబడుచున్నవి. ‘క, ఖ’ అనుగీత ఏమి? యని మీరు నన్ను ప్రశ్నింప వచ్చును. సముద్రతీరమున నిలువఁబడిసముద్రమువైపునకు చూచినయెడల భూమికిని, ఆకాశమునకును, విడదీయు రేఖయొకటి కానఁబడును. దీనినేదిగంతమందురు. ఇదియే యాగీత.

**12**—చూడుము.




ఈక్రిందియిల్లు మనదృష్టిమట్టపుగీతకన్న నెత్తుగానున్నది. అందువలన ఇంటికప్పుయొక్క క్రిందిభాగము కనఁబడు చున్నది. ఏవస్తువైనను దృష్టిమట్టపుగీతకు దిగువ నున్న యెడల ఆవస్తువుయొక్క పైభాగమును, దృష్టిమట్టపుగీతకు పైనయున్నయెడల ఆవస్తువుయొక్క అడుగుభాగమును కనఁబడును.

**13**—3 చూడుము.

1

ఎన్ని పెట్టెలుంచినను యిదియేవిధముగ భూమికి సమాంతరము (Parallel) గా నున్న అంచులన్నియు ఈ దృష్టిమట్టపు గీతయందు మనకంటికి సమముగా నున్న చుక్కవద్దనే కలియును.

**13**—1 చూడుము.

కాని యీదిగువ నుదహరించినపటముననుసరించి చూచిన మనము పైనుదహరించినది తప్పని తోఁచును. కాని అటులకాదు.

**13**—2 చూడుము.

2

ఒకటవనెంబరు గీతలన్నియు దిగంతమునందొక చుక్కదగ్గర కలియును. రెండవనెంబరు గీతలన్నియు ఆ గీత మీఁదనే మఱియొక చుక్కవద్దను కలియును.



3

13

## రెండవ ప్రకరణము.

మన యెదుట నొక పెట్టె నుంచుకొని పండ్రెండడుగుల దూరమునఁ గూర్చుండి వ్రాయ మొదలిడవలెను. వ్రాయునపుడు మాత్రము పెద్దపెన్సిలు దగ్గర నుండవలెను. ఈ పెన్సిలుతో కొలుచుచుండవలెను. 1-వ నెంబరుగీతను కొలుచునప్పు డీవిధముగ కొలువవలెను.

**14**—1 చూడుము.

దానికంటె మనకు చిన్నపటము వచ్చినయెడల రెండుమూఁడుమారులు పెద్దది చేయవచ్చును.



14—2 చూడుము.

పెట్టెను వ్రాయునప్పుడు 'క, ఖ' అను గీతను కొలిచి నిట్రము (Perpendicular) గా వ్రాయవలయును. తరువాతను 'గ, ఘ' లను నిర్ణయింపవలసియున్నది. పెన్సిలును ఆమూలలకు సమానముగాను భూమికి సమాంతరము (Parallel) గా నుంచి 'క, ఖ' యనుగీత నెక్కడ కలియుచున్నదో కనుగొనవలెను. తరువాత ఆగీతకీమూల లెంతదూరమున నున్నవో కొలిచినయెడల వీని యొక్క స్థలము నిర్ణయమగును.



14

ఈమూలలనుండి "గ చ" "ఘ ఛ" యను గీతలను "క ఖ" యనుగీతకు సమాంతరము (Parallel) గా వ్రాసి వానియొక్క పొడవును కొలువవలెను. అపుడు "చ ఛ" లు నిర్ణయమగును. తరువాతను "ఛ క" "ఛ క" "ఘ క" "గ ఖ," అనుగీతలను సులభముగా వ్రాయవచ్చును ఇంక "జ" యను చుక్కను నిర్ణయింపవలయును. మునుపటివలెనే పెన్సిలును "జ" యనుచుక్కకు సమముగాను, భూమికి నిట్రము (Perpendicular) గాను పెన్సిలునుంచి ఆపెన్సిలు "చ క" అనుగీత నెచ్చట కలియుచున్నదో కనుగొనవలెను. తరువాత నాస్థలమువద్దనుండి "జ" యనుస్థల మెంతదూరమున నున్నదో కొలిచి "జ" ను నిర్ణయింపవలెను. అప్పుడు "ఛ జ". "చ జ" యనుగీతలను గీయుట సులభము. ఈవిధముననే యేపెట్టెనైన గృహమునైనను శుభ్రముగ వ్రాయవచ్చును. కాని మునుపుచెప్పినప్రకారము కొన్నిగీత లొకచోటను, మఱికొన్ని గీతలు మఱియొకచోటను దిగంతమువీఁదను కలియునని జ్ఞాపకముంచుకొనవలెను. ఈప్రకారముగ మీరు వ్రాయుపటమునందు లేనియెడల వ్రాసినది తప్పని తెలిసికొనవలెను.

## మూఁడవ ప్రకరణము.

ముక్కోణపు ఆకారముగల ఘనపదార్థము.

15—1 చూడుము.




15

ఇది వ్రాయుట సులభము. మునుపుచెప్పినప్రకారము 1, 2, 3, నెంబరులగీతలను గీయవలెను. ఇందు 4-వ నెంబరు గీత యొకచోటను, 5-వ నెంబరుగీత యొకచోటను కలియును. కాని చక్రవాళమునకు సమమైనగీతకు సమాంతరముగ నున్నగీత లెప్పటికిని కలియవు.

స్తంభాకారము. **16—1** చూడుము.

దీనిని వ్రాయునప్పుడు 1, 2, నెంబరుల గీతలను వ్రాయవలెను తరువాతను 2-వ నెంబరు గీతలను రెండు సమభాగములుగ భాగించి గీనికి సమకోణములు వచ్చునట్లు 3-వ నెంబరు గీతలను కొలిచి వ్రాయవలయును. ఈ గీతలుకూడ రెండు సమభాగములుగ భాగింపఁబడియుండవలెను. అనఁగా 2, 3 నెంబర్లగీత లొకదానినొకటి సమ కోణములు వచ్చునటుల కలిసికొని సమభాగములుగా భాగింపఁబడవలయును. (They must bisect each other at Rt. ∟ ) వీనిసహాయమువలన వంకరగీతలను సులభముగ వ్రాయవచ్చును.





రైట్ ప్రిజిము. **16—2** చూడుము.

మొదట "చ ఘ" అను గీతను నిర్ణయించి "చ" ద్వారా "చ క" అనుగీతను, "ఘ" ద్వారా "ఘ ఖ" అనుగీతను కొలిచి నిట్రముగ వ్రాయవలెను. వెంటనే "క ఖ" అనుగీత నిర్ణయమగును. ఆ రెంటి సహాయమువలన "క ఘ" "ఖ చ" అనుగీతలను వ్రాయవలెను. ఇదివరకు రెండవ ప్రకరణమందు చెప్పిన విధమున "గ" ను "చ" ను నిర్ణయించి "చ ఛ" "ఛ క" "గ ఖ" "ఘ గ" అనుగీతలను వ్రాయవలెను. "గ ఛ" యనుగీత "క ఘ" యును "ఖ చ" యును కలియుచోటుద్వారా వెళ్లుచుండవలయును. అటులలేనియెడల చిత్రము తప్పని తెలిసికొనవలయును. ఇదివఱకు వ్రాసిన గీతలసహాయమువలన "యరలవ" లను నిర్ణయించి "యర" "రల" "లవ" లనుగీతలను వ్రాయవలెను. తరువాతను "ఖయ" "కర" "చల" "చవ" అనుగీతలను వ్రాయవలెను.







మఱియొకవిధముగ వ్రాయవచ్చును. 'యరలవ' లను నిశ్చయించి "ఖయ" "కర" "చల" "చవ" రేఖలను వ్రాసినతరువాత "యర" "రల" "లవ" లను వ్రాయవచ్చును. ఇదియే మంచిత్రోవ యని నా యుద్దేశము.





ఈపటమును వ్రాసినతరువాత నిది సమముగానున్నదా యని చూడవలసియున్నది. 4-వ నెంబరు గీతలన్నియు దిగంతముదగ్గర కలసినయెడల సమానముగ నున్నదని తెలిసికొనవలెను. దిగంతమున కీగీతలు సమాంతరముగా నుండినయెడల నిదివరకు చెప్పినప్రకారము ఇవి యెప్పటికిని కలియవు.

16

# చిత్రలేఖనము.

...ము. **16—2 చూడుము.**

... మొదట 1-వ నెంబరు గీతను ... దీనిని రెండు సమభాగములుగ ... ను వ్రాయవలెను. పిమ్మట పట ... కారమును వ్రాయవలెను. ... నుండి "క" వరకు ఒంటరిగా ... నొకరేఖను గీయవలెను. 'క' ... యుంచవలెను. తరువాత 3-వ నెంబరు గీతలను ... టమునందు చూపిన ప్రకారము లిఖింపవలెను. తరువాత 1, 2, 4 నెంబరు గీతలను రబ్బరుతో తుడిచి వేయవలెను.

[illegible]. ఇట్టి చిత్రములను వ్రాయునపుడు అనావశ్యకములైన గీతలను రబ్బరుతో తుడిచి వేయుట ముఖ్యము.

## గోపురాకారము.

**16—1 చూడుము.**

క్రిందటి ప్రకరణమునందు చెప్పినప్రకారము క్రింది చట్టమును వ్రాసి 1-వ నెంబరుగీతను కోణమునందువలెనే వ్రాయవలెను. పిమ్మట 2-వ నెంబరుగీతలను వ్రాయుట కష్టము లేదు. ముందు చెప్పినవిధముగ అనావశ్యకములైన గీతల నన్నిటిని రబ్బరుతో జాగ్రత్తతో తుడిచివేయవలయును.

## గోళము.

**16—3 చూడుము.**

ఇది యొక వలయాకారమువలెనే కానబడును. మొదట దీనియొక్క వ్యాసమును వ్రాసి దానిని రెండు సమభాగములుగా భాగించి ఆమధ్యస్థలమునుండి సమకోణములు వచ్చునట్లు అదియు పరిమాణముగ మఱి యొక వ్యాసమును వ్రాయవలెను. తరువాతను వలయాకారమును జాగ్రత్తగా వ్రాయవలెను.

## వివిధములైన ఘనపదార్థభాగములు. **17—1 చూ.**

ఇదివఱకు చెప్పినప్రకారము పైఁజెప్పినవి వ్రాయుట మిగుల సులభము. కాని వీనిని జాగ్రత్తగా వ్రాయవలెను. ఇవన్నియు చక్కగ నభ్యసింపవలయును. మనకు సహాయముకొఱకు వ్రాసుకొన్న యనావశ్యకములైన గీతల నన్నిటిని రబ్బరుతో చెరిపివేయవలెను.

తరువాతను కుర్చీబల్లలు, మేజాలు, గిలాసములు, డేరాలు మొదలగునవి వ్రాయుట నభ్యసింపవలెను.









17

ఇట్టిస్థలములను వ్రాయుటయం దొకజాగ్రత్తను వహింపవలయును. కొలతప్రకార మన్నియు వ్రాయవలసి యుండును. దూరముననున్న చెట్టుకంటె దగ్గరనున్న మనుజుడు పెద్దగ కనబడును. మనుజుడు, చెట్టు మనకొకే దూరమున నుండిన చెట్టునే పెద్దదిగ వ్రాయవలెను. పిల్లచెట్లు మనుష్యునికంటె చిన్నవిగ నుండవచ్చును. అట్టిసమయమున నాచెట్లు బాల్యమునం దున్నవని చక్కగ నిరూపింపవలయును.

ఇంకొకసంగతి. కొన్నిచిత్రములలో నొకరాతిదగ్గర నొకమనుజుడు నిలువబడినట్లు మీరనేకపర్యాయములు చిత్రపటములలో చూచియుందురు. ఆరాతియొక్క కొలతను తెలియజేయుట కట్టుల వ్రాసెదరు.

ఇప్పుడు మన మొక పెద్దవృక్షమును వ్రాసిన దానియెత్తు మనకు తెలియదు. దానిం దెలియజేయుటకుగాను సాధారణమైన పొడవుగలమనుష్యుని దానివద్ద నిలుచున్నటుల వ్రాసిన వృక్షముయొక్కయెత్తు చక్కగ విశదమగును.

ఒక్కొక్కదేశమునం దొక్కొక్కవిధమైన దుస్తులను ధరించెదరు. మహమ్మదీయులు షరాయిని తొడిగి వారి జాతీయటోపీని ధరించెదరు. హిందువులు పంచెనుకట్టి పాగాను ధరించెదరు. యూరోపియనులు పంట్లామును జోళ్లను, హేటును (Hat) వేసికొందురు. పంచెను కట్టుకొని తురకటోపీ నెవరును ధరింపరు. కాన నిట్టితప్పులనుండి మనము తప్పించుకొనుచుండవలెను.

హాలండునం దొకస్థలమును చిత్రించిన హాలండు మనుజులనే వ్రాసినయెడల సందర్భముగ నుండును. మనము వ్రాయు రూపమునం దుండుమనుజ లేదేశీయులో తెలిసికొనుటకు వీలుకలుగుచుండవలెను. ఒక్కొక్కదేశీయుల రూపురేఖ లొక్కొకమోస్తరుగ నుండును. వీనిని ప్రదర్శించుటయందుకూడ మిగుల జాగరూకత వహింపవలెను.

హిందూదేశమునం దొకకఱ్ఱం జేతనిడికొని గొఱ్ఱలకాపరి గొఱ్ఱలను కాయుచుండును. ఇంగ్లాండువారు పంట్లామును తొడుగుకొని పంకకఱ్ఱను పట్టుకొని గొఱ్ఱలను కాయుచుండును. కాన నట్టిసమయమునందు వానిదగ్గర హిందూదేశమునందు నివసించు రెండుకొబ్బరిచెట్లను వ్రాసిన సందర్భవిహీనముగ నుండును.

గాలివేయుచున్నప్పుడు చెట్లు వంగి యుండును. అన్నియు నొక్కవైపునకే వాలియుండును. అందున్న మనుష్యుల బట్టలుకూడ నెగురుచుండును. కనుక రూపమునందు కనుపఱచిన ప్రతివస్తువు గాలియొక్క ప్రతాపమునకు లోనైనది. ఇట్టివి వ్రాయుట చాల కష్టము.

19—1 చూడుము.




ఏదైన దేశచరిత్రమును వ్రాయునప్పు డేకాలమునందు జరిగిన సంగతిని ప్రదర్శింపబోవుచున్నామో మనస్సునం దుంచుకొని వ్రాయుట ప్రారంభింపవలయును. లేనియెడల తప్పులకు లోనౌదుము. అప్పటికాలపు ఆచారములు, దుస్తులు, వారుపయోగించు పరికరములు, ఇండ్లు మొదలుగాగలవానియొక్క రూపములు మనకు చక్కగ తెలిసియుండవలెను.

వివిధమైన గీతలు. గద్ది.

19—2 చూడుము.



# నాల్గవ భాగము.

## మనుజుని రూపము.

మనుష్యులను వ్రాయుటయందు మన మనేకసంగతులను గమనింపవలెను. మనము వ్రాసిన చిత్రమునందు భాగములన్నియు ననుపాతముగా నున్నవో లేవో చూచుకొనవలయును. **20**—1 చూడుము.




చిన్నకాళ్లును, పెద్దనడుమును, ఇంక పెద్దతలను, కలిపి వ్రాసినయెడల హాస్యాస్పదముగ నుండును. బుజ్జకు తగినచేయి, చేతికి తగిన దేహము, దేహమునకు తగిన కాళ్లు ఉండునటుల చిత్రమును వ్రాయవలయును.

కొన్నికొన్ని సమయములయందు కాళ్లు పెద్దవిగ వ్రాయవలసివచ్చును. మరికొన్నిసమయములయందు బుజ్జ పెద్దదిగ వ్రాయవలసివచ్చును. ఇట్టిసమయములయందటుల చేయక తీరదు. ఏలయన, నేదో యొకపుస్తకము ననుసరించి చిత్రమును వ్రాయవలసివచ్చినప్పు డందు చెప్పినట్లు వ్రాయుటకు బద్ధులై యుందుము. నవ్వుపుట్టించు చిత్రము నేదైన వ్రాయవలసివచ్చినప్పుడుకూడ మన మన్నియు సమముగ వ్రాయుటకు వీలుండదు. కాన మనము సమయమునుబట్టి చిత్రమును వ్రాయవలసియుండును.

**20**—2 చూడుము.




ఆఫ్రికాదేశమునందు నివసించు నీగ్రోజాతివారికి పెదవులు పెద్దవిగ నుండును. జపానుజాతీయులకు కండ్లు చిన్నవిగను ముఖములు బల్లపరుపుగ నుండును. పోలండు దేశీయులు కురుచగ నుందురు. వీరిచిత్రములను వ్రాయుటయందు వీరివీరిరూపముల ననుసరించి వ్రాయుచుండవలెను.

ఒకమనిషి నిలువబడియుండినవానిని వివిధస్థలములనుండి చూచిన ననేకవిధముల కనబడును.

**20**

మన మేధైనజనసమూహమును వ్రాయవలసివచ్చినపుడు మనుజులందఱొకేవిధముగ నిలువఁబడినటుల వ్రాసిన ప్రకృతిస్వరూపము ననుసరించి యుండదు. అందువలన ననేకవిధములైన రూపముల ననుసరించి వ్రాయుట నభ్యసింపవలయును. 21 చూడుము.

ఇచ్చట నచ్చువేసిన ప్రకారము తలల నభ్యసింపవలెను. మొదటిభాగమునందు మనుజునాకార మెట్లు వ్రాయుటయో చెప్పియుంటిమి. ఇట్టి స్థితి యందటుల వ్రాయుట మీరు మనుజుల నెటుల చూచెదరో యటుల నభ్యసింపవలెను.

కొన్ని సమయముల యందు కూర్చున్నటుల, మఱి కొన్ని సమయముల యందు నిలువఁబడినటుల, ఇతర సమయములయందు పనిచేయుచున్నటుల వ్రాయవలసివచ్చును.





21

స్త్రీలు కోమలశరీరలు. వారి యంగములు పురుషుల యంగములవలె నుండవు. ఇవి యెట్లుండునో చూచిననే బోధపడును గాని వర్ణించుట నాతరముకాదు. పురుషుల శరీరములందు నరములు కనఁబడుచుండును. స్త్రీల యంగములయందటుల కనఁబడవు. పురుషుల స్నాయువులు ప్రత్యేకకనఁబడును. స్త్రీలవి కనఁబడవు. ఇట్టిభేదములు బహు జాగరూకతతో గమనింపవలెను.

పురుషుల ముఖములకును స్త్రీల ముఖములకును ననేక భేదము లుండును.













ఇట్టివాని నభ్యసించుట యందు కన్నులు, ముక్కు, నోరు, మీసములు, గడ్డము, చెవులు, చేతులు, పాదములు, కాళ్లు మొదలగు నంగములను వ్రాయుట నేర్చుకొనవలెను. ఇంకొక సంగతిని జ్ఞాపక ముంచుకొన వలసియున్నది. వయస్సునుబట్టి యీ యంగము లాకారము మారుచుండును.

పసిబాలుని యంగము లన్నియు గుండ్రముగ నుండును. యౌవన వంతుని యంగము లన్నియు బలిష్ఠముగ యుండును. రోగుల మాట నేను చెప్పుట లేదు. వృద్ధుల యంగములు వదలి యుండును.

22—చూడుము.

**22**

## ఐదవ భాగము.

### ఛాయాపటములను పెద్దవిగ వ్రాయుట.

ముందు చెప్పినప్రకారము బాగుగ నభ్యసించినకాని ఛాయాపటములను పెద్దవిగ వ్రాయజాలరు. ప్రదేశ పటములను లిఖింపగలిగినను మనుష్యాకారములను చిత్రింపగలిగినను సరిగ్గ కుదురుట కష్టము. దీనియం దభ్యాసము కలుగజేసికొనుటకు ఛాయవ్రాయుట చాల యభ్యసింపవలయును. ఇందున బహుజాగరూకత గలిగియుండవలెను. లేనియెడల చిత్రమును వ్రాయజాలము. ఏలయన: కొంచెము తప్పిపోయిన చిత్రముయొక్క పోలికంతయు మారిపోవును.

ఛాయాపటములను పెద్దవిగ వ్రాయుటకు కావలసిన పరికరములు.

(1) వాట్టుమేన్సు డ్రాయింగు కాగితము. (Whatman's Drawing Paper)

ఈ డ్రాయింగు కాగితమును ఎంచుకొనుటయందు జాగ్రత్తను వహింపవలెను. ఈకాగితములలో కొన్నినున్నగ నుండును. మఱికొన్ని గరుకుగానుండును. ఇందు నున్నని కాగితమే మనకు కావలయును. రెండువైపుల నొక్కతీరుగ నుండదు. అందువలన మనము వ్రాయుటకు యోగ్యమైనప్రక్క నెంచుకొనవలయును. దీనిని తెలిసికొనుటకు కాగితమును వెలుతురువైపు పెట్టి చూచినయెడల సులభముగ తెలిసిపోవును. కాగితమునందు తెల్లని యక్షరములు ముద్రింపఁబడియుండును. ఆయక్షరములు సమముగ కనఁబడిన వదియే మంచివైపని నిర్ణయింపవలెను. తిరిగిపోయినటుల కనఁబడిన నది మంచిప్రక్క కాదని తెలియునది.

ఇట్లు డ్రాయింగు కాగితము నెంచుకొని దానిని (2) డ్రాయింగుబల్లపై నంటింపవలయును. ఇది చేవదారుతో చేయఁబడి నున్నగ నుండవలెను. అంటించునప్పుడేమియు ఒగ్గులు రాకుండ చూచుకొనవలెను. (3) గట్టిపెన్సిలు నొకటి జాగ్రత పెట్టవలయును. దీనికి ఏ. డబులూ. ఫేబరు; హెచ్చు (A. W. Faber. H.) నెంబరుగల పెన్సిలు యోగ్యముగ నుండును. (4) మెత్తని పెన్సిలొకటి కావలసియుండును. (5) బాగుగ చెరుపురబ్బరు చాలముఖ్యము.

ఇక వ్రాయుటకు ప్రారంభింతము. **23**—1 & 2 చూడుము.

ఛాయాపటము నొకదానిని తీసికొని దానిమీఁదను సమముగా పెన్సిలుతో చదరములను వ్రాయవలయును. మన మద్దాని నెన్నిరెట్లు పెద్దదిగ చేయవలయునో నిశ్చయించుకొనవలయును. పిమ్మట మనయుద్దేశము ప్రకారము నగీతలను పెద్దవిగచేసి వ్రాసికొనవలయును. చిన్నపటములో గీతలకు దూరము 2 యించీలున్నయెడల పెద్ద పటములో 3 యించీల దూర ముంచి గీతలను వ్రాసిన ఒకటిన్నరమాఱ్లు పెద్దదియగును. 1 ఇంచీల దూర ముంచి గీతలను వ్రాసినయెడల రెట్టింపగును. ఈవిధముననే యెంత పెద్దదిగ వ్రాయవలయునన్న నంత పెద్దదిగ చేయవచ్చును. (నాలుగైదు నిడివిగీతలకు మధ్యను, నాలుగు అయిదు అడ్డగీతలకు మధ్యనున్నది)

మఱియొకసారి **23**—1 & 2 చిత్రములను చూడుఁడు. కుడికన్ను రెండు, మూఁడు నిడివిగీతలకు మధ్యను, రెండు, మూఁడు అడ్డగీతలకు మధ్యనున్నది. దీని నిటులనే పెద్ద చిత్రమునందు వ్రాయవలెను. ఇటులనే అన్నిగీతలును యేయే చదరముల మధ్య నేభాగముమీఁదనుండి పోవుచున్నవో జాగ్రతగ గమనించి అటులనే పెద్దచిత్రమునందును వ్రాయవలయును. ఇటు లంతయు వ్రాసినతరువాత ననవసరమైన గీతలను మెల్లగ చెఱిపివేయవలెను. తరువాత నను జాగ్రతగా ఛాయను వ్రాసికొనిరావలెను. ఈకార్యము మెత్తని పెన్సిలుతో చేయవలెను. ఈ పెన్సిలు చాల మెత్తగను నల్లగను వ్రాయుచుండవలెను. ఇట్టిపెన్సిలునుతీసికొని ఛాయను జాగ్రతగ వ్రాయవలెను. కొంచెము తప్పిపోయినయెడల రూపమంతయు మాఱిపోవునని యిది వఱకే చెప్పియుంటిని. ఇందు చాల యభ్యాస ముండవలెను. లేనియెడల నెంతమాత్రమును వ్రాయఁజాలరు.

ఇంకొకసంగతిని గమనింపవలెను. ముఖమునంతను చక్కగ వ్రాసివేయవచ్చును గాని ముఖముయొక్క భావమును తెచ్చుట దుర్లభము. కొన్నిసమయములయందు విచారముగ కనఁబడును. కొన్నిసమయములయందు సంతోషముగ కనఁబడవచ్చును గాని మూలచిత్రమున నున్నకళ రాకపోవచ్చును. ఇందే విస్తారము కష్టము కలుగును.

ఈకళకు యిదివరకు చెప్పిన ఛాయయే ముఖ్యము. ఛాయ నిచ్చుటయందు తప్పిపోయిన కళగూడ తప్పిపోవును. కన్నులయందును, నోటియందును, నేమైన తప్పున్నయెడల కూడ తప్పిపోవును. ఛాయాపటములను పెద్దవిగ వ్రాయుట యింక రెండువిధము లున్నవి.

**23**—3, 4 చూడుము.







ఈ చిత్రములయందు కనబడుచున్నటుల కోణములను వ్రాసి పెద్దవిగ చేయవచ్చును. మూలచిత్రమునందు వ్రాసినప్రకారము కోణములను వ్రాయవలెను. కొప్పునకును నొసటికిని మధ్యభాగమునుండి గడ్డముకొనకును "కగ" యను గీతను వ్రాయుము. ముక్కుచివర భాగమును "ఖ" యని పిలుతము. "కఖ" లను "గఖ" లను గీతలద్వారా కలుపవలయును. "కఖ" ను కొలిచి దానిని కొన్నిరెట్లు పెద్దదిచేసి మనము వ్రాయదలచుకొన్న కాగితముమీద నొకగీతను గీయవలెను. తరువాతను "గకఖ" "కగఖ" యను కోణములను కొలిచి "ఖగక" యను త్రిభుజాకారమును వ్రాయవలయును. ఏమాత్రము కోణములు తప్పినప్పటికిని చాలవరకు చెడిపోవును. ఈగీతలసహాయమునుబట్టి చిత్రమును వ్రాయుట సులభము. తరువాతనే చిత్రము నంతటిని పూర్తిచేయవచ్చును.




తిన్నని ముఖ మున్నయెడల దానిని రెండు సమభాగములుగ చేసి సులభముగా వ్రాయవచ్చును. ముఖమును భాగించుగీత మనకు మిక్కిలి సహాయకారిగా నుండును. రెండుకన్నుల కొనలను ఒకగీతద్వారా కలుపుము. అది "ఖఘ" గీతను "క" వద్ద కలియుచున్నది.

తరువాతను నీవు వ్రాయవలసిన కాగితముమీద నొక గీతను గీచి దానియందు "క" యనుచుక్క నొకదానిని పెట్టుము. తరువాత "గకఘ" యనుకోణమును "కగ" ను కొలిచి నీ కాగితమునందు గీయుము. ఈగీతను నీయొక్క యుద్దేశముప్రకారము పెద్దదిగనో చిన్నదిగనో వ్రాయవచ్చును. ఈలాగుననే "కఖ" యనుగీతలుకూడ వ్రాయవలెను. తరువాత కన్నులను వ్రాయుట చాలసులభము.

**23**—5 చూడుము.







ఇవ్విధముననే తక్కినయంగములన్నియు వ్రాయవలెను.

మొదట చెప్పినప్రకారము మనము దేశపటములను వ్రాయవచ్చును. మూలపటమున నున్న అక్షాంశములను, దేశాంతరాంశలును పెద్దవిగనైనను చిన్నవిగనైనను వ్రాసికొని దానినిబట్టి పటము పై చెప్పినవిధముగ వ్రాయవలెను.

# చిత్రలేఖనము.

## BOOK II.

## ప్రథమ భాగము.

### రంగులు పూయుట.

కొందఱికి కొన్నిరంగు లిష్టము. ఇతరులకు మఱికొన్ని యిష్టము. ఈయిష్టానిష్టములు వారివారి మనస్సులనుబట్టి యుండును. ప్రపంచమునందు మూఁడువర్ణము లున్నవని న్యూటను (Newton) చెప్పెను. అవి ఎఱుపు, పసుపు, నీలి. వీనిలో రెంటిని కలిపిన వేఱురంగులు వచ్చును. వీనిని గౌణవర్ణము (Secondary Colours) లందురు. వీనిలో రెంటిని కలిపిన తృతీయవర్ణములు (Teriatory Colours) వచ్చును.

| | |
|---|---|
| ఎఱుపు + పసుపు = నారింజ వర్ణము.<br>పసుపు + నీలి = ఆకుపచ్చ వర్ణము.<br>నీలి + ఎఱుపు = ఊదా వర్ణము. | గౌణ వర్ణములు. |
| నారింజ వర్ణము + ఆకుపచ్చ = సిట్రిను.<br>ఆకుపచ్చ + ఊదా = ఆలివు.<br>ఊదా + నారింజ = కావిరంగు. | తృతీయ వర్ణములు. |

పైని చెప్పినదానినిబట్టి చూచినయెడల నారింజవర్ణము, ఆకుపచ్చ, ఊదా, గౌణవర్ణము లనియు, సిట్రిను, ఆలివు, కావిరంగు తృతీయవర్ణము లనియు తెలియును.

ఈ క్రింద వ్రాసిన చిత్రమును చూచిన నివి చక్కఁగ బోధపడును. **24**—పటము.

1



2



3

**24**

| | | |
|---|---|---|
| 1. కావిరంగు. | 1. ఊదా. | 7. పసుపు. |
| 2. ఎఱుపు. | 5. నారింజ. | 8. ఆలివు. |
| 3. ఆకుపచ్చ. | 6. నీలి. | 9. సిట్రిను. |

కావిరంగును, ఆలివును, సిట్రినును, బాగుగ బోధపఱచుకొనుటకు పచ్చని బూడిదవర్ణము, నీలమైన బూడిద వర్ణము, ఎఱ్ఱని బూడిదవర్ణము అని పిలుతేము.

ప్రథమరంగుల (Primary Colours) దట్ట మీవిధముగ చూపింపఁబడినది.

ఎఱుపు = 5. పసుపు = 3. నీలి = 8.

ఎఱుపును దట్టముచేసిన నలుపుగనో లేక ఊదావర్ణముగనో కనఁబడును. పలుచగ చేసిన గులాబిరంగుగనో లేక మట్టిరంగుగనో మాఱును.

పసుపువర్ణమును దట్టము చేసిన, మట్టిరంగుగనో ఆకుపచ్చగనో మాఱును. పలుచన చేసిన, బూడిదవర్ణముగ మాఱును. లేనియెడల నారింగు శుభ్రముగ మాయమై పోవును. నీలియందు మార్పు లేమియు లేదు.

ఏదోయొకరంగును తీసుకొని ఛాయను సులభముగ చేయఁగలము. ఈగుణము చిత్రకారులకు చాల సహాయకారిగ నున్నది. సాధారణముగ మన మొక పెన్సిలును చేతనిడుకొని చిత్రమును వ్రాయ మొదలిడెదము. సృష్టియందిటులకాదు. ప్రతివస్తువును రంగులతో మిశ్రితమై యుండును. అందువలన మనము చిత్రములను వ్రాయుటయందు సృష్టి ననుసరించుట యుత్తమము.

వస్తువుయొక్క రంగునుబట్టి ఛాయ మాఱుచుండు నని మనము సాధారణముగ తలఁతుము కాని యీ ఛాయను వెలుతురుకూడ మార్చుచుండును.

ఎఱుపువర్ణము బాకాయొక్క ధ్వనికి పోల్చఁబడినది. నీలిరంగు పిల్లనగ్రోవియొక్క శబ్దమునకు సరిపోల్చఁబడినది.

మన యిష్టానిష్టముల ప్రకారము వాసనవచ్చునటుల వాసనద్రవ్యములను కలిపెదము. రుచికలుగునటుల తిను బండారములను వండెదము. అటులనే మన మనస్సునకు తృప్తి కలుగునటుల రంగులను కలుపవలెను.

ఏలయన: చక్కని యత్తరును, మంచి సంగీతమును, రుచిగల భోజనమును, మనము ప్రేమించునటుల నే యానందమును కలుగఁజేయు చిత్రమును చూచుట కభిలాషపడెదము.

సంగీతవిద్యార్థి ప్రథమమున మంచి కృతులను పాడలేఁడు. అభ్యసించినకొలఁదిని వానిజ్ఞాన మావిషయమున నభివృద్ధిపొంది తుదకు కర్ణానందముగ గానము చేయఁగలఁడు. అటులనే మనము ప్రతినిమిషమును సృష్టిని చూచు నప్పటికిని ప్రథమమున చక్కగా రంగులతో చిత్రములను వ్రాయఁజాలము. అభ్యసించినకొలఁది నైపుణ్య మబ్బును.

కొందఱు మొదట కొన్నిరంగులకు భేదము కనుఁగొనలేరు. అభ్యాసము చాలకపోవుటయే దీనికి కారణము.

కొందఱు ఒకచేతతోనే వ్రాయఁగలరు. మఱికొందఱు రెండు హస్తములతోను చిత్రింపఁగలరు. దీనికిని అభ్యాసమే ముఖ్యము. గుఱ్ఱమును ఒంటెవలె నడిపింపవచ్చును. ఒంటెను పిల్లివలె నడిపింపవచ్చును. అటులనే ఎడమ చేతిని కుడిచేతివలెనే పనిచేయింపవచ్చును. ఫిడిల్ వాయించువాఁడు రెండుచేతులను ఉపయోగించును. ఏ చేయి చేయవలసినపని నది చేసివేయుచుండును. అటులనే మన మభ్యసించినయెడల రెండుచేతులతోను వ్రాయవచ్చును.

మనము కొంచెము ఇంద్రధనుస్సువైపు చూతము. అందు ఏడురంగులు కాన్పించును. 24—2 చూడుము.

మనము చిత్రమును వ్రాసినప్పుడు ఇష్టము వచ్చినటుల వ్రాయుటకు వీలుండదు. కొన్ని నిబంధనలకు లోఁబడ వలసివచ్చును.

చిత్రములను చిత్రించుటకు 5, 2, నెంబరుల విండ్సర్, న్యూటను కుంచెలు (Windsor and Newtons' Red Sable hair brushes Nos. 5 and 2.) కావలసియుండును.

క్రొత్తవారు నేర్చుకొనుట కేదైనరంగును దట్టముగ నరుగఁదీసి వలయాకారములయందా రంగును పూయుచుండవలెను.
తరువాత నీవలయాకారములద్వారా అక్షరములను వ్రాసి యొక్కొక్కవలయమునకు నొక్కొక్కరంగును పూయుచుండవలెను. సాధారణముగ నవి యీదిగువచెప్పినప్రకారము పూసిన సుందరముగ కనఁబడును.

1. ఎఱుపు. 2. ఊదా. 3. గాఢనీలము. 4. నీలము. 5. ఆకుపచ్చ. 6. పసుపు. 7. నారింజ.

24—3 చూడుము.

# చిత్రలేఖనము.
















ఇందు చక్కఁగ నభ్యాసమైనతరువాత ఇండియన్ యింకు (Indian Ink) నరుగదీసి దానితో చిత్రములను వ్రాయుచుండవలెను. మొదటిభాగమునందు పెన్సిలుతో జంతువులను సులభముగ వ్రాయుటఁ జెప్పితిని. అటులనే యిప్పుడు కుంచెతో వ్రాయుట నభ్యసింపవలయును.

ప్రారంభమునందు ఆకును చేత నిడికొని దానిని చూచుచు వ్రాయ నభ్యసింపవలయును. తరువాత జంట యాకులను వ్రాయవలెను. ఇందభ్యాసమైనతరువాతను పుష్పములను చిన్నచిన్నకొమ్మలను వ్రాసిన మంచిది. ఫలములను వ్రాయుట సులభము. ఏదైననొకఫలమును దగ్గర నుంచుకొని దానిని చూచుచు నతిజాగ్రత్తగ చిత్రించుచుండవలెను. కలశములను చూచి వ్రాయుట మంచిది. ఈయన్నిటియందు నభ్యాసమైన తరువాత చెట్లనుచూచి వ్రాయుచుండవలెను. ఎటుల వ్రాయుటయో యీదిగువ నుదహరించిన చిత్రములను చూచిన బోధపడును. నేను చెప్పినవే వ్రాయవలెననికాదు. మీకేవి బాగుగ తోఁచునో వాని నన్నిటిని వ్రాయుచుండుట మంచిది. కోళ్లు, పావురములు, చేపలు, కీటకములు మొదలగునవి వ్రాయుటకెంతయో యానందకరముగ నుండును. పడవలను వ్రాయుట యెంతయో బాగుగ నుండును. వీనిని వ్రాయుసిరా మిక్కిలి చక్కగ నుండవలెను. కుంచెయొక్క మొన సన్నముగ నుండిననే గాని వ్రాయఁజాలరు.

25—చూడుము.

ఇవన్నియు చక్కఁగ వ్రాయగలిగినతరువాత ప్రదేశ చిత్రములను వ్రాయవలెను. ఏదైన నొకస్థలమునందు కూర్చుండి ఎదుట కనఁబడుచున్న ప్రదేశమును చిత్రించుట బహు ఆనందకరముగ నుండును. విస్తారమభ్యాసముండిననేకాని ఇటుల వ్రాయఁజాలము. తరువాతను మనుష్యుల చిత్రములను వ్రాయుట నభ్యసింపవలెను.

26, 27, 28 పటములను చూడుఁడు.




27


28

పైఁజెప్పినవానియం దభ్యాసమైనతరువాత వివిధమైన రంగులతో చిత్రములను వ్రాయ నభ్యసింపనలెను.

ఒకకాగితమును తీసికొని దానిని డ్రాయింగు ఫలకమునం దంటించి రంగును పూయుటకు సిద్ధపఱుపవలెను. రంగును చాల పలుచగా కలిపి యొక చిన్నగాజుపళ్లెము (Slant) నం దుంచవలెను. తరువాత శుభ్రమైన కుంచెను తీసి రంగునందు ముంచి కాగితముపై వేయుట ప్రారంభింపవలయును. ఈరంగు చిక్కగ నుండిన సమానముగ వచ్చునటుల పూయఁజాలము. రంగును మీఁదినుండి క్రిందికి పూయుచుండవలెను. కుంచె నెప్పుడును క్రిందికే జరుపుచుండవలెను. కాని మీఁదికి జరుపరాదు. ఇటుల చేసినయెడల చిత్రము చెడిపోవును. డ్రాయింగు ఫలకము ఏటవాలుగ నుండిన సదుపాయముగ నుండును.





ఈరంగు పూసినతరువాత బాగుగ నారనీయవలెను. తడిగానున్నపుడే రెండవపర్యాయము రంగును వేసిననొక చోట పలుచగను, నొకచోట దట్టముగ నంటుకొనును. ఇటులనే అనేకపర్యాయములు పలుచని రంగును పూసి దట్టముగ రంగంటుకొనునటుల చేయవచ్చును.

ఇటుల వేయఁగలిగినతరువాత వలయాకారమును పెన్సిలుతో చుట్టి దానియందు రంగును పూయుచుండవలెను.

క్రొత్తవారు దట్టముగ రంగును పూయుట కిచ్చగించెదరు. రంగును పూయుటయం దభిలాషను పుట్టించుటకు సులభమైనటువంటి వివిధమైన చిత్రములను వ్రాసి వానియందు రంగును పూయుచుండవలెను. వీనికనుకూలమైనవి వివిధదేశపు బావుటాలే. ఇవిగాక 29-వ పటములో చూపినవి వ్రాయవలెను. 29—చూడుము.









జర్మను పతాకము. స్విజరులాండుపతాకము. జపానుపతాకము. 29

వీనియం దభ్యాసమైనతరువాత వివిధమైన వస్తువులను వ్రాసి వానికనుగుణమైన రంగులను పూయుచుండవలెను.

ఆకును వ్రాసి యాకుపచ్చను దట్టముగ పూయవలెను. నారింజపండును వ్రాసి నారింజరంగును వేయవలయును. నిమ్మపండును వ్రాసి పసుపును పూయవలెను.

ఇటులనే చెట్లనుకూడ వ్రాయవచ్చును. చిక్కనియాకుపచ్చను తీసికొని చెట్టుకొమ్మలవలె కాగితమునందు పూసి మట్టిరంగు (Burnt Sienna) తో మొండెమును చిత్రింపవలెను. ఈచెట్లను వ్రాయువిషయమై మఱియొక ప్రకరణమునందు చెప్పెదను.

పైఁజెప్పినవాని నన్నిటిని వ్రాసివేయవచ్చును; కాని అవి యెటుల కనఁబడునో యటుల వ్రాయుట కష్టము. దీనికి ఛాయయే ముఖ్యము. వీనికి రెండు కుంచెలు కావలసియుండును. ఒకకుంచెతో రంగును వేయుచు రెండవ కుంచెను నీటియందు ముంచుచు తుడుచుచుండవలెను. అనఁగా రంగును సన్నని కుంచెతో నొకధారవలె వేయుచు నీటితో దానియొక్క కొనను తుడిచిన ఛాయ శుభ్రముగ వచ్చును.

మొదట హెచ్చుతగ్గులుగ వచ్చును. అభ్యాసమైనకొలఁది చదునుగా రంగును వేయఁగలుగుదురు.

ఒకఫలమును వ్రాసి దానికేదైన నొకరంగును వేసి ఛాయ నియ్యవలెను. పుష్పములను వ్రాయుటయందు నిటులనే చేయవలెను. ఛాయ నియ్యనిది పుష్పము కళావిహీనముగ నుండును. ఈఛాయ సూర్యుని వెలుతురు వలన జన్మించుచున్నది. ఏలయన: ఒకవైపున సూర్యుఁడు ప్రకాశించునప్పుడు మఱియొకవైపున చీఁకటిగ నుండును. రాత్రులు, పగళ్లు కలుగుట కిదియే కారణమని మన భూగోళశాస్త్రజ్ఞులు చెప్పియున్నారు. వస్తువుయొక్కయొకవైపున సూర్యుఁడు ప్రకాశించిన రెండవవైపున చీఁకటిగ నుండును. అందువలన నేదైన చిత్రమును వ్రాయునప్పుడు ఛాయ నిచ్చుచుండవలెను. 30—చూడుము.




ఇందభ్యాసమైనతరువాత చిన్నప్రదేశచిత్రములను వ్రాయుచుండవలెను. ఇదివఱకు మీరు చెట్లను వ్రాయుట నభ్యసించితిరి. కనుక చిన్నచెట్లతోను పర్వతములతోను చిత్రములను వ్రాయుట సులభమని నాతాత్పర్యము. ఈ ప్రదేశచిత్రములను వ్రాయుటయందు చాల సంగతులను గమనింపవలెను. కాని ప్రారంభకులు సాధారణముగ వ్రాసిన చాలును. ఆనిబంధనలకు లోఁబడనియెడల ప్రదేశ చిత్రములను వ్రాయుట సులభమైనపనియే. అభ్యాసమైనకొలఁదిని వానినన్నిటిని గమనింపవలసియుండును. ప్రారంభకులే యట్లు చేసినయెడల వారెప్పటికిని మంచి చిత్రములను వ్రాయఁజాలరు. నేనిదివఱకే చెప్పియుంటిని. సంగీతములో ప్రారంభమున కృతులనే నేర్పించినవానికి సంగీతమబ్బునా? అబ్బినను వట్టి సంగీతజ్ఞానశూన్యుఁడగును.





30

# రెండవ భాగము.

## ప్రదేశపటములను రంగులతో చిత్రించుట.

## (LANDSCAPE PAINTING.)

సూర్యుఁడు గొప్పరంగు వేయువాఁడు. గొప్ప చిత్రకారుఁడు. వీనిప్రకాశమునుబట్టి సృష్టియొక్క రంగు మాఱుచుండును. సూర్యకాంతి లేనపుడు ప్రపంచమంతయు నంధకారపూరితమైయుండును. తీక్ష్ణముగ ప్రకాశించు నప్పు డన్నియు శుభ్రముగ కనఁబడును. సూర్యకిరణములు వేనిమీఁద పడిన నవి చాలవఱకు తెల్లగ కనఁబడును. వానివాని నిజరంగులను వెల్లడిపుచ్చుచుండును. కొన్నికొన్నిసమయములయందు వానినిజమైనరంగులను పోఁగొట్టుకొనుచుండును. నల్లని వస్తువును సూర్యుని ప్రకాశమునం దుంచిన నది యంతనల్లగ కాన్పింపదు. దానినే నీడయం దుంచిన స్వాభావికమైన రంగుతో కాన్పించును. ప్రదేశచిత్రములను వ్రాయుటయం దీవిషయమై చిత్రకారులు బహుజాగ్రత్తగ నుండవలెను.

ఈ సూర్యప్రకాశమే ఛాయకు కారణము. ప్రాతఃకాలపు సూర్యప్రకాశము సున్నితచ్ఛాయను గలిగి యుండును. అప్పుడు సూర్యరశ్మిచే తాఁకఁబడిన వస్తువు లన్నియు పసుపురంగును పొందును. సాయంకాలంబున తామ్రవర్ణపు కిరణములు సూర్యునినుండి వెలువడును. అప్పుడు సృష్టియందుండు వస్తువులన్నియు నాచాయను పొందును.

ప్రదేశచిత్రములందు ముఖ్యముగ చూపవలసిన దొకవస్తువునే వ్రాయుచు దానికనుగుణముగ తక్కినవి వ్రాయుచుండవలెను. ఇట్టిపటములను చూచినవెంటనే యావస్తువు దృగ్గోచరమగుచుండవలెను. అందువలన దీనిని చిత్రముయొక్క మధ్యను వ్రాసిన బాగుగనుండును. వీనికై సమయోచితముల వ్రాయవలెనేకాని వీలుకాని సమయములు మధ్య నట్టివస్తువును వ్రాసి చిత్రముయొక్క సౌందర్యమును పోఁగొట్టరాదు.

మన మొకయుదాహరణమును తీసికొందము. ఒకచిత్రమునందు నల్లని చెట్లసమూహమును వ్రాయుదము, సూర్యుని యాకసమునైనను, తెల్లని మేఘములనైనను, యింక యితరమైన సౌందర్యమైనవస్తువును కేవలము వ్రాయ కూడదు. ఏలనన: నీవు చూపఁదలచుకొనిన చెట్లయొక్క ప్రాముఖ్యత తగ్గిపోవును. నల్లని చెట్లయొక్క రంగునకును, సూర్యుని ప్రకాశమునకును విరుద్ధభావము కల్పించును ఇట్టి రంగులగు చెట్లసమూహము ప్రకాశించుచుండు సూర్యుని చిత్రమును వ్రాసిన చెట్లకు నలుపు మిశ్రితమైన ఆకుపచ్చకు బదులు ఊదా మిశ్రితమైన ఆకుపచ్చరంగును వేయవలసియుండును.

ఇదివఱకు చెప్పినటుల నీనిబంధన లన్నిటికిని లోనై యాచిత్రమును పూర్తిచేయవలెను. ఇది ముఖ్యముగ కావలసినది. సాధ్యమైనంతవఱకు నీనిబంధనలు ననుసరించుటయే మంచిది. కాని సమానముగ మనోరంజకము కలుగఁజేయు వస్తువు లేవియు నొకేచిత్రమునందు వ్రాయకూడదు. ఏలయన: ఇదివఱకు చెప్పినటుల రెండువస్తువుల యొక్క ప్రాముఖ్యతయును చెడిపోవును.

పటముయొక్క చివరయందు ఛాయ దట్టముగనుండదు. కొన్నిసమయములయందు పటముయొక్క క్రిందిభాగమునందు పలుచగ నుండును. ఏలయన: క్రిందిభాగము మనకు దగ్గరగ నుండును. మీఁదిభాగము దూరముగనుండును.

ఇంకొక సంగతిని గమనింపవలసియున్నది. క్రిందిభాగమునం దేమియు పెద్దవస్తువులను వ్రాయకూడదు. అటుల వ్రాసినయెడల పటముయొక్క సౌందర్యము చెడిపోవును. ముఖ్యమైన వస్తువుల ప్రాముఖ్యత పోవును.

మనకు కనఁబడునటుల వ్రాయవలదా? నిజమును ప్రదర్శింపవలదా? యని మీరు నన్ను ప్రశ్నింపవచ్చును. మనము దృష్టము నెంచుకొనునప్పుడే జాగ్రత్తగనుండవలెను. అభ్యాసమైనకొలఁదిని ఇట్టివి యెంచుకొను శక్తిగలుగు నని నే నిదివఱకు చెప్పియుంటిని.

ఛాయను వ్రాయునపుడు బహుజాగరూకులమై యుండవలెను. నీడయు వెలుతురును అనుపాతముగ నుండవలెను. తెల్లని వస్తువునందు నల్లనిచుక్క నొకదానిని పెట్టిన నసందర్భముగ నుండును. ఇట్టితప్పులనుండి తప్పించుకొనుట కభ్యాసమే ముఖ్యము కాని నేను చెప్పుట కేమియు లేదు.

అంతేకాక యాలోచనయందును సృష్టియొక్క మోస్తరుగనుండదు. కనుక నొక్కొక్క రొక్కొక్కవిధముగ వ్రాయుచుందురు. కురుచైన చిత్రకారుడు మనుష్యాకారములను పొట్టిగ వ్రాయును. పొడుగైనవాడు పొడుగుగ వ్రాయును.

సాధారణముగ చెట్లు ఆకుపచ్చగ కనబడునని తలంతురు. నమ్మెదను. అభ్యాసమైనకొలదిని అవి సాధారణముగ నట్టి యాకుపచ్చగ కనబడవని తెలిసికొనెదరు. దూరమునుబట్టి రంగులు మాఱుచుండును. సూర్యరశ్మి తగులుటవలన నాకులపై భాగములు గాఢమైనరంగులను కలిగియుండును. క్రిందికి ఉన్నవైపులు మట్టిరంగు మిశ్రితమైనవై యుండును. అందువలన నారంగులు మిశ్రితమై యట్టి ఆకుపచ్చగ కనబడవని నేను దృఢముగ చెప్పగలను.

గాలియందనేకమైన పదార్థము లుండును. ధూళి యెగురుచుండును. నీటివాయువు కలిసియుండును. కొన్ని సమయములయందు మంచు పడుచుండును. అందువలన దూరపువస్తువులు దగ్గరవస్తువు లంత శుభ్రముగ కానరావు. దూరమున నున్నవస్తువులచాయ యంతదట్టముగ కానరాదు.

సాధారణముగ పర్వతములు నీలిగ నుండునని యందుము; కాని యవి నిశ్చయముగ నారంగు కలవి కావు. మనకవి నీలిగనే కనబడును. వాటి నిస్థితస్థలమునుబట్టి సూర్యునిగమనమునుబట్టి వాటిరంగు మాఱుచుండును. దూరముగ నున్నవస్తువులు నీలిరంగుగ నుండు ననుసంగతి మనకు విదితమే. గడ్డిచే కప్పబడు పర్వతములకంటె, చెట్లుమయమైనగిరులు నీలిరంగుగ కనబడును.

ఇంకొకసంగతిని గమనింపుడు. దూరముగనున్న పర్వతములరంగు, దానివెనుకనున్న ఆకాశముయొక్క రంగున కనుగుణముగ నుండును. పర్వతములు నీలిగనైనను ఊదాగనైన నున్న నావెనుకనున్న యాకాశపురంగు నీలిగనైనను ఊదాగనైన నుండును. ఆకాశ మెఱుపుగనున్న పర్వతము లూదాగ నుండును.

అంతేందుకు ? ఆకాశపురంగునుబట్టి సృష్టియొక్క రంగును మాఱుచుండును. ఈగ్రంథము ఇరువదవపేజీయందు వేసిన చిత్రములను చూచిన మీకు బాగుగ బోధపడును. ఇందుకు కారణ మేమని మీ రడుగవచ్చును.

ఎఱ్ఱని వెలుతురునం దొకవస్తువును పెట్టినయెడల దానియొక్కరంగు చాలవఱకు ఎఱ్ఱగ మాఱుచుండును.

అలలనీటిరంగును మీరడిగిన నీలియని చెప్పెదరు; కాని మనము చూచునప్పుడది నిజముగ నీలిరంగుగ కనబడదు. దీనిరంగు ముఖ్యముగ నాకాశపురంగునుబట్టి మాఱుచుండును. ఏలయన: ఆకాశపురంగే నీటియందు ప్రతిబింబితమగుచుండును. చుట్టునున్నచెట్లు మున్నగునవి కూడ ప్రతిఫలించును. నీటియొక్క రంగు గమనింపవలసియున్నది. స్వచ్ఛమైననీటికి రంగు లేకపోయినప్పటికిని జలసమూహము నీలిగనే కనబడును. కొంతనీరు మట్టిరంగుగ నుండును. మఱికొంత నల్లగ గనబడును. మధ్యధరాసముద్రపునీ రన్నిటికంటె నీలమైనదని కనిపెట్టబడినది. వీటన్నిటిని గమనించి మనము చిత్రింపవలెను.

తలవెంట్రుకలు నల్లనిరంగు గలవి. అవి యెల్లకాలములయందును మనకు నల్లగ కనబడును. కాని అవి మెఱయుచుండుటవలన వాటియొక్కరంగు మాఱుచుండును. కాన ప్రదేశచిత్రములను వ్రాయునప్పుడు వేళను ఆకాశపుస్థితిని గమనించుచుండవలెను.

దగ్గరనున్న వస్తువులు దూరముననున్న వస్తువులకంటె బాగుగ కనబడునని యిదివరకే చెప్పియుంటిని. దగ్గరనున్న గడ్డిపోచ కనబడవచ్చును కాని దూరముననున్న చిన్నమొలకకూడ కనబడకపోవచ్చు ననికూడ యిదివఱకు చెప్పియుంటిని. వీటిని మఱచిపోరాదు.

ఈ నిబంధనల నన్నిటిని చూచి మీరు బెంగ పెట్టుకొనరాదు. అభ్యసించినకొలది నవియే యలవడును. లోకమునందు మనుజుడు చేయలేనిపని లేదు. చావును జయించుటకంటె నవి గొప్పవియా ?

# మూఁడవ భాగము.

## చెట్లు, వాటిని చిత్రించు విధము.

భారతభూమి సౌందర్యమునకు నిలయమైయున్నది. దీనిప్రసిద్ధి పూర్వకాలమునందుకూడ లోకమునం దంతటను వ్యాపించియుండెను. ఈదేశమునం దన్నిదేశపు సృష్టిచిత్రములను చూడనగును. హిమాలయపర్వతపువరకు వెళ్లిన నుత్తరప్రదేశమువలె నుండును. మధ్యను సమశీతోష్ణముగ నుండును. కాఁబట్టి మన మనేకవిధములైనదృష్టములనెంచుకొని చిత్రించవచ్చును. ఇట్టిదృష్టములకు సొగసు కలుగఁజేయునవి వృక్షములే. వృక్షజాతులు మనదేశమునం దనేకము లున్నవి. చిత్రలేఖనమునం దభ్యాసము కలుగఁజేసికొని మాతృభూమి యగుభారతదేశమున మంచి దృష్టముల నెంచుకొని చిత్రించి, జగత్తునం దంతటను ప్రసిద్ధిగాంచవచ్చును.

చిత్రకారులు చెట్లను వ్రాయవలెనన్న ప్రతివృక్షముయొక్క స్వభావమును గమనించవలెను. ఏలయన: అన్నిచెట్లు నొకేవిధముగ నుండవు. పుస్తకములను చదువుటవలనను, ఒక్కదినము సమయమును వినియోగించిన చెట్లను వ్రాయఁజాలరు. అందువలన ప్రతిదినమును జాగరూకతతో వివిధమైన చెట్లను గమనించుచుండవలెను.

వివిధవృక్షములు వివిధస్థలములయందు పెరుఁగును. వివిధకాలములయందు చిగుర్చును. పుష్పించును. కొన్నిచెట్లు యిండ్లసన్న సాధారణముగ కనఁబడును. మఱికొన్ని అడవులయందు దృగ్గోచరమగును. ఇట్టిభేదములను గమనించుచుండినగాని తప్పులులేక వ్రాయుట యసంభవము. ఏలయన: తాను బోధపఱచుకొననిది చిత్రకారుఁడు వ్రాయఁజాలఁడు. వేయేల? చెట్లు వానిస్నేహితులు కావలయును.

చెట్లయాకారములు :—చెట్లు బల్లపరుపుగా నుండక గుండ్రముగ నుండును. ముఖ్యాధారమైనవేళ్లచే భూమియందు వృక్షము నాటఁబడియుండును. సాధ్యమైనంతవఱకు దీనిమొదలు తిన్నగ లేచుటకు ప్రయత్నించును. ఈమొదలునుండియే కొమ్మలు లేచును. ఈకొమ్మలు మొదట బలముగాను పైకి వెళ్లినకొలఁది సన్నముగాను పరిణమించును. ఈసన్ననిభాగములయందు ఆకులు, పుష్పములు, పండ్లు మొదలగునవి కనఁబడును.

మనము చెట్లతో పరిచయము కలుగఁజేసికొనవలయునన్న మొదట వాటియొక్క వేళ్లు, మొండెము, కొమ్మలు, ఆకులు, ఫలములు మొదలగువాటివిషయమై కొంచెము నేర్చుకొనవలయును. ఇవి పైకి యెటుల కనఁబడునో అటుల వ్రాయవలెను. ఇనప్పటికిని వాటియొక్క జీవనమువిషయమై కొంచెము నేర్చుకొనవలయును కొన్ని యెందుకటుల పెరుఁగునో అవి యెట్టివర్షముచే కప్పఁబడియుండునో, దీనియొక్క ఆకారమేమియో ఏయేస్థలములయందటుల పెరుఁగునో నేర్చుకొనవలయును.

కొమ్మలు మొండెమునుంచి పెరుగును. ఇది మొండెమునుండి వెలువడినప్పు డనేకకోణములకు కారణమగును. ఈకోణములు వివిధవృక్షజాతులనుబట్టి యుండును. గుగ్గిలపు చెట్టుయొక్క కొమ్మల కోణములు (angles) మామిడికొమ్మలకోణములకంటె చిన్నవిగ నుండును. కొన్నికొమ్మలు సమకోణములుగనే వెలువడును.

అడవియందు చెట్లు స్వేచ్ఛగా పెరుఁగును. మనుష్యసంచార ప్రదేశములయం దటుల పెరుగఁజాలవు. ఏలయని మీరు నన్నడుగవచ్చును. మనుష్యులు చెట్లకొమ్మలను నఱికివేయుదురు. పశువులు దిగువనున్న కొమ్మలయాకులను భక్షించి కొమ్మలను కుఱుచగ చేసివేయును. ఇట్టిమార్పులు అడవియం దుండు చెట్లయందు కానరావు.

పర్వతములమీఁదను పెరుగు చెట్లకొమ్మలు మీఁదికి వంగియుండును. చదునగు నేలయందు పెరుగు చెట్లయం దీమార్పులు కానరావు

ఋతువులనుబట్టి యీచెట్లు చాలవఱకు మాఱుచుండును. శీతకాలమందు ఆకులను రాల్చును. వసంతమునందు చిగుర్చును. కొన్నిసమయములయందు కొన్నిచెట్లు చిగుర్చును. మఱికొన్ని సమయములయందు కొన్ని చిగుర్చును. కాన వీటివీటి నైజగుణములను జాగరూకతతో గమనింపవలెను. కొన్నిచెట్లు రాత్రులయం దాకులను

ముడుచుకొనును. కొన్ని పగటిపూట నట్టిమార్పును చెందును. వీటివిషయమై వీలైనయెడల మనము తరువాతను నేర్చుకొందము.

మొండెము :—భూమిపైని కొమ్మలెటుల వ్యాపించియుండునో భూమియందు వేరులటుండును. ఈవేరులే మొండెమును నిలువబెట్టియుంచునని యిదివఱకే నేర్చుకొనియుంటిరి. ఈమొండెము శాఖలను, ఆకులను భరించుచున్నది. ఇదికాక దీనిద్వారానే వేళ్లనుండి కొమ్మలకు ఆకులకు ఆహారము నెక్కుచున్నది.

అన్నిచెట్లయొక్క మొండెములు ఒకేవిధముగ నుండవు. ఎవరో వ్రాసిన చిత్రములయందలి మొండెముల రూపములను మనము చూచి వ్రాయకూడదు. వీటిరూపములను సృష్టియందే చూచి వ్రాయ నభ్యసింపవలెను. మన పుట్టిచెట్లను చూడనిది వ్రాసినయెడల అసందర్భములకు లోనగుదుము. మనస్నేహితుని ఛాయాపటమును చూచి దానిని మనమద్దమున వర్ణించుటకును, మనమే స్వంతముగ నాతనిముఖమును చూచినదానికిని భేదము లేదా? ఒకచిత్రమును చూచి వ్రాసినయెడల వివరములను వ్రాయజాలము. వ్రాసినయెడల సృష్టిననుసరించి యుండదు.

మామిడి, మఱ్ఱి మొండెములు సమముగ నుండవు. జామచెట్టుయొక్క మొదలు వంకరగాను నునుపుగాను ఉండును. గుగ్గిలపుచెట్టు సన్నముగను పొడవుగ నుండును. అరటిచెట్టు సన్నగను, పొరలుగ నుండును. ఇట్టివి మనము జాగ్రత్తతో నిత్యము గమనింపవలెను. ఒక్కొక్క జాతియొక్క వివిధవృక్షముల మొదళ్లు వివిధాకారములను దాల్చియుండును కాని వానిజాతిస్వభావములనుమాత్ర మతిక్రమింపవు.

ఇంకొకవిషయమును గమనింపవలెను. ఎంతయెత్తునుండి కొమ్మలు పుట్టునో చూడవలెను. కొబ్బరి, తాటి, పోక, ఖర్జూరపుచెట్లమాట విడిచిపెట్టుదము. వాటికి కొమ్మలను పోలు ఆకులుతప్ప శాఖలుండనే యుండవు. కొన్నిచెట్ల కొమ్మలు బహుదిగువనుండి మొండెములను కప్పివేయును. దీనికి పనసచెట్టే నిదర్శనము. కొన్నిచెట్లయొక్క శాఖలు యెత్తుగ నుండును. మనుష్యులు సంచరించు స్థలములయందుండు చెట్లకొమ్మలు దిగువనే పుట్టును. ఏలయన : మనుజులు చిగుళ్లను కొట్టివేయుదురు. అందువలన ప్రక్కలయందు శాఖలు చిగుర్చును.

చెట్టుయొక్క మొండెమును చూచినవెంటనే అది యేజాతివృక్షమో సులభముగ పోల్చుకొనవచ్చును. చెట్ల యొక్క బెరడులు వివిధాకృతులను దాల్చియుండును. ఈవిషయమై యిదివఱకే చెప్పియుంటిమి. గనుక నిక చెప్పవలసిన యగత్యము లేదు. జాగ్రత్తగ గమనించినగాని యిందు చెప్పినంతమాత్రమున నేర్చుకొనజాలరు.

చెట్టుయొక్క వివిధభాగములయందుండు బెరడుయొక్క లక్షణములను ఆకులురాల్పుకాలమునందు చూచుటకనుకూలముగ నుండును. అప్పుడు ఆకులేమియు మనకడ్డురావు. అందువలన చెట్టుయొక్క ప్రతిభాగమును స్పష్టముగ కనబడును.

కొమ్మలు :—చెట్టుయొక్క మొండెమునుండి కొమ్మలు పైకివచ్చును. కాని ఒకేచెట్టుయందుండు కొమ్మలొక్కవిధముగ నెప్పుడు నుండవు. బెరడొకేవిధముగ నుండును. కాని కొమ్మలయందుండు బెరడుకంటె మొండెమునందుండు బెరడు ముదురుగ నుండును. ఏలయన : కొమ్మలు లేతవి. బాలునిదేహము కోమలముగా నుండును. వృద్ధుల దేహమంత మృదువుగా నుండదు. అటులనే యీచెట్లయందుకూడ భేదము కాన్పించును.

కొన్నిచెట్లు చూచుటకు గుండ్రముగా నుండును. ఏలయన : క్రిందికొమ్మలు భూమిపైపునకు వ్రాలియుండును. మీదికొమ్మలు సూటిగా లేచును. మధ్యనున్నకొమ్మలు క్రిందికొమ్మలకును, మీదికొమ్మలకును, మధ్యనుండు స్థలము నాక్రమించియుండును. అందువలన నిట్టి చెట్లకొమ్మలకోణములవిషయమై చెప్పుటకేమియు వీలులేదు. మీదికోణములు చిన్నవిగను క్రిందికోణములు పెద్దవిగ నుండునని చెప్పుటకుమాత్రము వీలు కలుగును.

కొన్నిచెట్లను దగ్గరగా పాతెదరు. అందువలన పెరుగుటయందివి యనేకమార్పులను చెందును. ఈవిషయమందుమాత్రము మనము పైనిచెప్పిన ప్రకారము వర్తించుటకు వీలుండదు. ఎల్లప్పుడును సమయము ననుసరించియే మనము ప్రవర్తించుచుండవలెను.

కొన్ని చెట్లయందు కొమ్మలు ఒకేచోటునుండి బయలువెడలును. ఇట్టిచెట్లు బహువిచిత్రముగ నుండును.

**31**—1 చూడుము.

మనవైపునకు వచ్చినకొమ్మలనుకాని, మనవైపునకు వ్యతిరిక్తముగ పెరుగుకొమ్మలనుకాని వ్రాయుట దుర్లభము. అప్పుడీకొమ్మలయొక్క వంకరలన్నియు చూపుచు వ్రాయుచుండవలెను లేనియెడల చిత్రముయొక్క సౌందర్యమంతయు నశించును. ఇట్టికష్టములు వృక్షములకు ఆకులులేని కాలమునందు తటస్థించును. ఆకులున్నచో కొమ్మలంతగా కనబడవు. అందువలన నంతదుర్లభముగనుండదు. కనుక వేసవియందు చెట్లకొమ్మలను వ్రాయుట బహుసులభము.




ఆకులచే గప్పబడియున్న కొమ్మలు భారముచే వంగియుండును. ఆకులులేని కొమ్మ లంత వంగియుండవు.

కొన్నిచెట్లకొమ్మలు పొడవుగ నుండును. కొన్నిచెట్ల కొమ్మలు పొట్టిగ నుండును. కొన్నికొమ్మలు సన్నముగను, పొడవుగ నుండును. కొన్ని పొట్టిగను దళముగనుండును. ఇట్టివన్నియు బాగుగ సృష్టియందు చూచుచుండవలెను. ఏయేచెట్లు యేయేకాలములయం దెట్లుండునో బాగుగ గమనించవలెను. లేనియెడల నిట్టివి చక్కగ ప్రదర్శింపలేకపోదుము.




ఆకులు :—చెట్లయొక్క అన్నిభాగములకంటె ఆకులు ముఖ్యములు. ఆకులులేనిచెట్టు భర్తలేనిస్త్రీవలె నుండును. మొండెమును, కొమ్మలును, అస్థిపంజరమునకును, ఆకులు మాంసచర్మాదులకును పోల్పబడినవి. మాంసమును చర్మమును అస్థిపంజరమున కెట్టుల సౌందర్యమును కలుగజేయునో ఆకులు చెట్ల నట్టుల నలంకరించును. ఇట్టియాకులను వ్రాయుటయే చాలదుర్లభము. చిత్రించుటలో ప్రవీణత యున్నవాడు చెట్లశాఖలనుగూర్చి విస్తారము తెలియకపోయినను వ్రాసివేయగలడు. కాని ఆకుల నట్టుల చిత్రింపలేడు. అప్రవీణులగుచిత్రకారులు ప్రతియాకును చిత్రించెదరు. అది తప్పు. చాల దగ్గరగనున్న కొమ్మలయాకులుమాత్రము విడివిడిగ కన్పడును కాని దూరముగనున్నవటుల కనుపడవు. అన్నియు కలసిన పుంజ [illegible] చెట్ల యాకారములు నొకేవిధముగ నుండవు. [illegible] ముగచిత్రించి వివిధమైనచెట్ల రూపములను చక్కగ ప్రదర్శింపవచ్చును. అందువలననే ప్రతిచెట్టు వునందును గమనించుచుండవలెనని మొదటనుండి చెప్పుచువచ్చితిని.







**31**

మొదట మన మొకచిన్నకొమ్మను వ్రాయుట నేర్చుకొనవలయును. ఇందు ప్రతియాకును ములనీడ నొకబాట చిత్రమును పూర్తిచేయవలెను. ఇం దభ్యాసమైనతరువాతను కొంచెము పెద్దకొమ్మను వ్రాతస్థలమునందు కొన్ని

ఇట్టిచిత్రములయందు ప్రతియాకును వ్రాయక దానియాకారము వచ్చునటుల గీతలను గీయుచుండవలెను. ఇటుల వ్రాయునపుడు అది యేజాతిచెట్టుయొక్క కొమ్మయో తెలిసికొనఁగలుగునటుల వ్రాయుటకు ప్రయత్నించుచుండవలెను.

గుబ్బకీయాకునైనను, ఆమునపు ఆకునైనను అనేకవిధముల నుంచి వ్రాయుచు కొమ్మలను వ్రాయుటకూడ అభ్యసింపవలెను. ఇట్టియాకులు గలకొమ్మలకును తక్కిన కొమ్మలకును చాల భేదముండును. అందువలన నిట్టివి తప్పులు లేకుండ వ్రాయవచ్చును.

ఏచెట్టు ఏకాలమునందు సుందరముగ కానవచ్చునో, ఆచెట్టు నట్టికాలమునందే వ్రాయుట నభ్యసింపవలెను. అసహ్యమును పుట్టించు వస్తువులకంటె కన్నులపండువుగ నుండువస్తువులను వ్రాయుటకు మనము సాధారణముగ కుతూహలపడుచుందుము.

సూర్యుఁడు ప్రకాశించునప్పుడు సూర్యకిరణములు చెట్లపైఁ బడి వాటికి పన్నినన్నెలరంగులను తెచ్చుచుండును. వాటినీడ భూమిపైఁ బడుచుండును. మంచు పడుచున్నపుడు సృష్టియందలి వస్తువులు బాగుగ కనపడవు. చీకటిరాత్రిసంగతి నిఁక చెప్ప నక్కఱలేదు. చంద్రకాంతిలో సృష్టి యంతబాగుగ కన్పడదు. అందువలన సాయంకాలమునందో, ప్రాతఃకాలమునందో బయటికి వెళ్లి యేదోయొకచోటను కూర్చుండి చెట్లను వ్రాయుట నభ్యసింపవలెను. ప్రారంభికుల కిదియే మంచిసమయము.

మొదట చెట్ల నెందుకు వ్రాయుట నభ్యసింపఁగూడదు? కొమ్మల నెందుకు వ్రాయవలెను? అని మీరు నన్ను ప్రశ్నింపవచ్చును. లోపలిమర్మములు తెలియనిది వ్రాసిన నేమిలాభము? అక్షరాభ్యాసము చేయనిది నవలలను, ప్రబంధములను చదువుటకు యత్నించుట నవ్వులచేటు కాదా? అందువలన మీరు మొదట యాకులను, తరువాత కొమ్మలను, పిమ్మట చెట్లను వ్రాయుట నభ్యసింపవలెను.

చెట్టును వ్రాయునపుడు చిన్నచిన్నకొమ్మలవిషయమై విస్తారము శ్రమపుచ్చుకొనక పెద్దకొమ్మలనే బాగుగ చిత్రమునందు చూపుటకు ప్రయత్నించవలెను. ఏలయన: దూరమునకంత చిన్నకొమ్మలు కానరావు. అటులనే చెట్ల యాకులు విడివిడిగ కన్పడవు. అన్నియు కలిసిపోయినటులుండును. ఈకొమ్మలను ఆకులను విడివిడిగ వ్రాయుటయందింకొకలాభ మున్నది. కొన్నిసమయములయందు ఒకేచెట్టును వ్రాసి అందివియన్నియు చూపించవలసియుండును. జాగ్రతగ నేర్చుకొనినదెప్పటికిని వృథాయైపోదు. అట్టియభ్యాసము నిన్ను కష్టములనుండి తొలఁగించవచ్చునేమో ఎవరెఱుగుదురు? అనేకవిధములగు చెట్లను వ్రాయవలసివచ్చునపుడు ఇవియన్నియు నీ కుపయోగించును.

వివిధదూరములయం దుండుచెట్లు:—దూరముగ నుండుచెట్లయొక్క వివిధభాగము లంతబాగుగ కనపడవని యిదివఱకే చెప్పియుంటిని. ఒకచెట్లసమూహ మొకచోట నుండినయెడల భూమిలోనికి పెరిగిన యూడలతోనున్న మఱ్ఱిచెట్టువలె కనఁబడును. దూరముగను దగ్గరగ నుండుచెట్లకు చాలభేద ముండును. ప్రకృతిచిత్రము ననుసరించి మనము చిత్రించవలెనన్న దూరముగనున్నచెట్లు మనకెక్కువ కష్టము కలుగఁజేయును. ఆకాశపురంగునుబట్టియు, వేళనుబట్టియు, ఛాయనుబట్టియు చెట్లయొక్కరంగు మాఱుచుండును. అందువలన మనచిత్రమునం దవి యన్నియు చూపించవలసియుండును.

ఏయేచెట్లు ఎట్టిప్రదేశములయందు పెరుఁగునో గమనించవలెను. మఱ్ఱిచెట్లు ఇసుకనేలలయందును, సరుగుడు నేలలయందును, జామచెట్లు రాళ్లయందును, ధాన్యము కొండమీఁదను పెరుఁగవు. అట్టిసమయము లజాగరూకతతో మెలఁగవలెను. మనయిష్టముప్రకారము ఏదోయొకచెట్టు నెచ్చోటనో వ్రాసి

తోను ఈచిత్రములు అవి యేవన (1) ధరి

రదగ్గరగ పుట్టును. కొన్నిదూరముగ నుండును. వీటిజాతి నైజమునుబట్టి యుండును.

ఒకేజాతిచెట్ల నొకేవిధముగ వ్రాయఁజాలము. వృద్ధవృక్షములు బాలవృక్షములు నొకేవిధముగ నుండవు. బాలవృక్షములబెరడు మిగుల కోమలముగ నుండును. ఆకులు అంతదట్టముగ నుండవు: కాని ఆకులులేనికొమ్మలు మాత్ర ముండవు. మధ్యవయసుగలచెట్లయం దాకులు దట్టముగ నుండును. కాని అచ్చటచ్చట ఆకులులేనిశాఖ లుండును. వృద్ధవృక్షములయందు ఆకులు విస్తార ముండవు. బెరడు మిగుల కఠినముగ నుండును. చాలకొమ్మలు విరిగి పోయియుండును. ఇట్టివన్నియు చూచుచుండవలెను.

### వివిధపరికరముల నుపయోగించి చెట్లను వ్రాయుట.

అనేకపరికరముల నుపయోగించి చిత్తరువులును వ్రాయవచ్చునని పుస్తకప్రారంభమునందే చెప్పియుంటిమి. వృక్షపటములను వ్రాయుటయందు ప్రసిద్ధిగాంచిన చిత్రకారులు, మెత్తనిపెన్సిలులను, నీరురంగులను, నూనెరంగులను ఉపయోగించెదరు. కాని యీపుస్తకమునందు నూనెరంగులవిషయమై చెప్పుటకు నిశ్చయించుకొనలేదు.

పెన్సిలును మనము సాధారణముగ చెక్కునటుల చెక్కఁగూడదు. పెన్సిలుయొక్క సీసమును గసి (Wedge) ఆకారముగ చెక్కవలెను. దీనితో మనయిష్టప్రకారము సన్నముగాఁగాని వలముగాఁగాని గీతలను గీయవచ్చును. కాన నిట్టిపెన్సిలుకొన మనకు చాలయుపయోగకరముగ నుండును. చెట్టుయొక్క మొండెమును వ్రాయునప్పుడు సన్నని గీతలును, దట్టమైనగీతలును కావలసియుండును. ఆకులను వ్రాయునప్పుడు సన్ననిగీత లుపయోగకరముగ నుండును.

ఆకుల వ్రాయుటయందు మిక్కిలి ప్రావీణ్యము గలిగియుండవలెను వీటిని వ్రాయుట కనుగుణమైనగీతల నభ్యసింపవలసియుండును. తఱుచుగ వ్రాయుచుండుటవలననే వచ్చును కాని పుస్తకములను చదివినంతమాత్రమున వలపడదు. సంగీతగ్రంథములను చదివినవారందఱును కృతులను పాడఁగలరా? అటులనే చిత్రలేఖనమం దభ్యాస ముండవలెను. కొందఱు సంగీతవిద్యార్థులు సంవత్సరములకొలఁది కష్టపడి సంగీతవిద్య నభ్యసించి బాగుగ గానము చేయలేకున్నారు. ఇట్టివిద్యలు పట్టుబడుట కష్టమగుటచేతను, వారు మంచిమార్గమున నభ్యసింపకపోవుటచేతను యీ కళయందు ప్రవీణులు కాజాలక యున్నారు. అందువలన చిత్రలేఖనమును బహుశ్రద్ధాభక్తులతో నేర్చుకొనవలెను.

చాలయభ్యాసమువలన మనహస్తము నుపయోగించుట నేర్చుకొనవలెను. పెన్సిలును కొనవద్ద పట్టుకొనరాదు. మెల్లగ పెన్సిలుతో వ్రాయుట నభ్యసింపవలెను.

మొదట సన్ననిగీతలతో చెట్లపై యాకారములను వ్రాయవలెను. ఈవిషయము చాలముఖ్యము. పైయాకారము మును చక్కగ వ్రాయనిది చెట్టును పూర్తిచేయరాదు. మొండెమును కనఁబడుచున్నకొమ్మలను మొదట చిత్రించవలెను. తరువాత నీచిత్రము బాగుగ నున్నదో లేదో చూచుకొని వివరములను కొంచెము దట్టమైనగీతలతో చిత్రింపవలెను. మనచిత్రమునుబట్టి యీగీతలు మాఱుచుండును. మోటుగ వ్రాయవలెనన్న దట్టమైన పెద్దగీతలతోను, నాజూకుగ చిత్రింపవలెనన్న సన్నని చిన్నగీతలతోను వ్రాయవలెను. ఏవిధమున వ్రాసినను ప్రకృతిచిత్రము ననుసరింపవచ్చును. వివిధజాతులచెట్లను చక్కగ పైజెప్పినరెండువిధముల వ్రాసి ప్రదర్శింపవచ్చును.

ఈవిధముగనే సుద్దతోను, మసిబొగ్గుతోను వ్రాయవచ్చును. దేనితో వ్రాసినప్పటికిని ఈవిద్య నీవ్రేళ్లకొనయందుండునటుల నభ్యసింపవలయును. మనుజునిరక్తి కంతము లేదు. దీని నెంతయభ్యసించిన నంతయభివృద్ధినొందును.

నీరురంగులు వృక్షపటమునకు వన్నె తెచ్చును. ఇతరచిత్రములయందువలె దీనియందు రంగును సమముగ పూయనేర్చినంతమాత్రమున లాభము లేదు. మొదట నొకరంగును పలుచగ చెట్టునకువేసి యది బాగుగ నారక ముందు మఱియొకరంగును వేయవలసియుండును. ఏరంగును వేయవలసియుండునో మీరే యాలోచింపుఁడు. ఇందుకు ఏయేరంగులను కలిపిన నేరంగు వచ్చునో బాగుగ తెలిసియుండవలెను.

చెట్లను రంగులతో చిత్రించుటయం దొకయాకుపచ్చనే యుపయోగించుట తప్పు. అనేకరంగుల నుపయోగించవలసియుండును.

రెండవపర్యాయము రంగును వేయునపుడు ఛాయను వెలుతురును చెట్టుచెట్టుకు భేదమును తెలియఁజేయవలెను. తడిగ నున్నపుడే రెండవమారు రంగు వేసిన చెదరిపోవును. ఇది కొన్నిసమయములయందు లాభముగను, కొన్నితరుణములయందు నష్టముగను పరిణమించును. చెదరకుండ నుండవలెనన్న మొదట వేసినరంగు ఆరినవఱకును వేచియుండవలెను. మూఁడవపర్యాయము రంగును వేయునపుడు చెట్టుయొక్క జాతిని తెలియఁజేయునటుల చిత్రింపవలెను. దీనితో రంగును వేయుట పూర్తిచేయవచ్చును. ఈమూఁడుముక్కలలో మనపని సరిపోలేదు. మనము విసుకుదల లేకుండ చాలదినము లభ్యసింపవలెను. పెన్సిలుతో వ్రాయునపుడు ఛాయను, వెలుతురును, చెట్లజాతిభేదమును తెలియఁజేయవచ్చును. రంగులను పూసి వెలుతురును, జాతిభేదములను, రంగులను తెలియఁజేయవచ్చును. రంగులను పూసినచిత్రము ప్రకృతిచిత్రము ననుసరించి యుండును. అందువలన పటములను రంగులతో చిత్రించుటయే మంచిది.

కొన్నిసమయములయందు ఒకేరంగుతో చిత్రింపవలసియుండును. అప్పుడు వివిధతరగతులఛాయను జాగరూకతతో చిత్రింపవలెను. ఇటుల చేయక ఛాయను వ్రాయవలసినచోటను నష్టముగను, వెలుతురును ప్రదర్శింపవలసిన చోటున పలుచగను చిత్రించి చిత్రమును పూర్తిచేసితి నని యుప్పొంగరాదు.

చెట్లస్వభావమున ఆకుపచ్చగ కనఁబడినను వేళనుబట్టియు, ఋతువు ననుసరించియు, ఆకాశపురంగునుబట్టియు, చెట్టురంగు మాఱుచుండు ననియు నిదివఱకే చెప్పియుంటిని. అన్నిచెట్టు లొకేరంగుగ నుండవు. జామచెట్టు రంగుకంటె మామిడిచెట్టురంగు చిక్కముగ నుండును. మామిడిచెట్టురంగుకంటె పనసచెట్టురంగు గాఢముగ నుండును. ఇట్టిభేదము లన్నియు మనచిత్రమునందు చూపుచు వివిధజాతులచెట్లను చక్కగ ప్రదర్శింప ప్రయత్నించవలెను.

## వివిధతరగతుల చెట్లు.

వటవృక్షము :—ఇది హిందూదేశవృక్షములకు రాజు. దీనిని ప్రతిదినము మనము చూచుచుందుము. ఈ వృక్షము బాగుగ పెరిగిన పెద్దమేడవలె నుండును. ఇది మనకు మిక్కిలి యుపయోగకారి. దీనియాకులయందు భుజింతురు. దీనియూడలను దంతధావనము చేయుటకు నుపయోగింతురు. దీనిపాలు జిగురుగ నుపయోగపడును. దీనినీడయందు అనేకులు బాటసారులు శ్రమ దీర్చుకొందురు. దీనిఫలములు పక్షుల కాహారము. ఇట్టివృక్షమును చిత్రించుట మనము నేర్చుకొనుట విధాయకము.

మఱ్ఱిచెట్టునందు ఆకులు దట్టముగ నుండవు కొమ్మలెల్లచోట్లను కనఁబడుచుండును.

మొండెము :—దీనిమొండెము మిగుల బలముగాను, కఠినముగా నుండును. ఎచ్చటచూచినను తొఱ్ఱలు గుంపులు కానవచ్చుచుండును. అనేకమొండెములు కలసియున్నటులుండును. దీనిపై నొకవిధమైన తెల్లనినాచు పెరుగును. ఇది కొమ్మలయందుకూడ పెరుగును. అంతట నిది వ్యాపించనప్పటికిని అచ్చటచ్చట వృక్షమంతట వ్యాపించి బిఱుసుపురి చెక్కలువలె కాన్పించుచుండును.

కొమ్మలు :—ఇవియు బలముగాను, కఠినముగాను ఉండును. మొండె మంతయభ్యాసకరముగ నివి కానరానప్పటికిని గుంపులతో నిండియుండును. ఇది వంకరగ పెరుగును. సాధారణముగ నీకొమ్మలు భూమికి సమాంతరములుగ నుండును.

ఆకులు :—ఈయాకులు యించుమించు గుండ్రముగనుండును వీటికాఁడలు పొట్టిగను, పసు[illegible]ణముగను [illegible]యందు గుంపులుగుంపులుగ పండ్లతో కలసి పెరుగుచుండును. చిగుళ్లు సూదిగ కానవచ్చును. ఇవి క[illegible]మ్మల[illegible] ఆకులు వార్ధక్యమునందు పసుపు నుండును. ఆకులు నీలమిశ్రితమైన గాఢమైన ఆకుపచ్చనిరంగును కలిగియున్నవి.

31—2 చూడుము.

పచ్చగనైపోవును.

పండ్లు :—ఈచెట్టుయొక్క పుష్పములు కానరావు. పండ్లు కొమ్మలకొనలయందు గుంపులుగుంపులుగ పెరుగును.

పుష్పనుయమైయుండి పచ్చగ కానవచ్చును. అచ్చటచ్చట కొన్ని పచ్చని ఆకులు కానవచ్చుచుండును. ఫలించుకాలమును చూచుకొందము. ఈకాలమునం దన్నిమామిడి చెట్లును ఆకుపచ్చగనే యుండును. చిగుర్లన్నియు పచ్చని యాకులుగ మాఱును. అప్పుడు చెట్టున కనేకులాశ్రితులుండెదరు. ఫలములతో నిండియున్న చెట్టుక్రింద నొకరిద్దఱు మనుజులుండినటుల వ్రాసిన బహుబాగుగ నుండును. అందువలన నాకాలమునందు మామిడిచెట్టుక్రింద నున్న చిన్నమొలక లన్నియు చచ్చి నున్నగ నుండును.

ఫలములు :—ఈఫలము లన్నియు నొకేవిధముగ నుండవు. **31**—3 చూడుము.

కొన్ని గుండ్రముగను, కొన్నిపొడవుగను, కొన్ని చిన్నవిగను, మఱికొన్ని పెద్దవిగను ఉండును. పండినప్పుడు గూడవీటిరంగు వివిధములుగ మాఱుచుండును. కొన్ని ఫలములు కాయలవలెనే యాకుపచ్చగ నుండును. కొన్ని యెఱ్ఱగను మఱికొన్ని పసుపుపచ్చగను ఉండును.

బదనిక :—ఈచెట్టుపై నొకవిధమైన బదనిక పెరుగుచుండును. దీనియాకులు జామియాకులను పోలియుండును. కాని కొంచెము దట్టముగ నుండును. ఇది చెట్టంతయు వ్యాపించకపోయినప్పటికిని పెరిగినంతమట్టుకు దట్టముగ నేదోయొకకొమ్మపై నభివృద్ధిపొందును.

వేళ్లు :—మామిడివేళ్లు భూమియందు చాలవఱకు వ్యాపించును. పైని చెట్టెంతపెరుగునో లోపల వేళ్లంత పెరుగును. ఈవేళ్లు అచ్చటచ్చట పైకికానవచ్చుచుండును.

జా మి చె ట్టు.

ఈచెట్టు మామిడిచెట్టంతబలముగ నుండదు. దీని మొండెము సన్నముగ నుండును. కాని వంకరగను
చెట్టును, మఱ్ఱిచెట్టును మించియుండును. దీనియం
నుండవు. దీనిమొరడు నున్నగను
దీనియాకులరంగు మఱ్ఱి

—4 చూడుము.

దీనిపండ్లు పచ్చిగ నున్నపుడు ఆకుపచ్చగను, పండినతర్వాత పసుపుగనుండును. దీనిపువ్వులు తెల్లగను సుందరముగ నుండును. ఫలము పక్వమైనకొలదిని పుష్పముశుష్కించును. **32**—చూడుము.




నునించివ్రాయుట నభ్యసింపవలెను. ఇకను తుప్పలను చూతము.

గు లా బి మొ క్క.

నును ప్రేమింతురు. కావున దీని ననుదినమును మనము చూచుచుందుము. ఈమొక్క చెట్టువలె పెద్దదికాదు. సాధారణముగ భూమికి శాఖలు తగిలియేయుండును. అందువలన దీని

మొండెము కానరాదు. మొండెము లేదనికూడ చెప్పఁగలము. భూమిమట్టమునద్దనుండియే యనేకకొమ్మలుగ విడిపోయి తుప్పవలె పెరుగును. ఈకొమ్మలు సన్నముగను పొడవుగను ఉండును. విస్తారము పుష్పించుటకుఁగాను వీటికి సగముసఱకు నఱికివేయుదురు. అందువలన కోసివేయఁబడిన కొమ్మలను మన మనేకము చూచుచుందుము. అందువలననే యిది చాలకురుచగ పెరుఁగుచున్నది.

ఈతు ప్పంతటను వంకర యగుచిన్నముల్లు పెరుగును. ఇంత చక్కనిపూవు లుండుచెట్టునకుఁగూడ ముల్లుండవలెనా? ఆహా! ఎంతటివానికైనలోపము లుండకమానవు కదా!

దీనియాకులు చిన్నవిగను, సౌందర్యముగను ఉండును. ఈయాకుల యంచులు కరకుగ నుండును.

మామిడి, మఱ్ఱియాకులవలెఁగాక యివి అనేకచిన్నయాకులు గలసి యొక పెద్దయాకుగ తెలియఁబడుచున్నవి.

ఇవి నీలిమిశ్రిత మైనఆకుపచ్చనిరంగును కలిగియున్నవి. అందువలన నీతుప్పలు అన్నికాలములయందును గాఢమైనరంగును కలిగియుండును. సాధారణముగా నొకపెద్దయాకునందు ఏడుచిన్నయాకు లుండును. కొన్నిసమయములయందు అయిదు మూఁడు చిన్నయాకులున్న పెద్దయాకును చూచుచుందుము.

పుష్పములు సాధారణముగ గులాబిరంగుగ నుండును. మృదువైన పుష్పదళము లనేకములు కలసి యొక పుష్పమగును. ఈచక్కనిమృదు వైన రేకులు చూచుట కెంతయో యానందకరముగ నుండును. దీనిపుప్పొడి పసుపువర్ణముగ నుండును. ఈపుష్పమంతయు నొకయాకుపచ్చనిరంగు గలయండకోశముపై నిర్మింపఁబడియుండును.

పుష్పములు కొమ్మలకొనయందు గుంపులుగ నుండును. కొన్ని పుష్పించియుండును మఱికొన్ని మొగ్గలుగనే యుండును. కొన్ని అప్పుడే పుట్టుచుండును. ఇట్టికొమ్మను వ్రాసిన నెంతయో చక్కగ నుండును.

అనేకవిధము లైనగులాబిజాతు లున్నవి. కొన్ని పాదువలె ప్రాకును. వీటియందు పసుపువర్ణము గలపుష్పములు పుష్పించును. ఇటులనే బ్రహ్మజెముడు, కొబ్బరి, ఈఁతచెట్టు మొదలగువానిని చూచుచు వ్రాయుచుండవలెను. ఎట్టివి యెటుల మీరు గమనింపవలయునో యిందు చెప్పితిని. కాని విపులముగ తెలిసికొనవలె నన్న వృక్షశాస్త్రమును చదివిన బోధపడును. చదివినంతమాత్రమున లాభము లేదు. పుస్తకమును వీపుహస్తంబున నిడికొని ఆయాచెట్టును చూచుచు చదివిన లాభకరముగ నుండును.

ఇంకొకయంశమును చెప్ప మఱచితిని. చెట్లవిషయమై నే నింతవిపులముగఁ జెప్పినందులకు నన్ను నిందించవలదు. సృష్టికి సౌందర్యము నిచ్చునవి చెట్లు. అందువలన మనము ప్రదేశచిత్రములను వ్రాసినయెడల చెట్లను సౌందర్యముగ చిత్రించవలసియుండును.

చిత్రలేఖనమునందు మంచిప్రావీణ్యము కలుగఁజేసికొనవలెనని యెల్లప్పుడును పుస్తకములను వ్రాయుంగు పరికరములను వెంటను కొనిపోవలెను. ఎచ్చట దేనిని చూచిన దానిని చిత్రమును వ్రాసివేయుచుండవలెను. గోవులు మేయుస్థలమునకు పోయి చూచినయెడల మన మనేకవిధము లైనయవస్థలలో వాటిని చూడఁగలము. కొన్నిశయనించియుండును. మఱికొన్ని మేయుచుండును. కొన్ని నిలువఁబడియుండును. పరుగెత్తునటుల, నడచునటుల మనము వాటిని చూతుము. అట్టిసమయమునందు వాటిని చూచి వ్రాయుచుండిన నెంత యభ్యాసము కలుగునో యాలోచింపుఁడు.

ఇటులనే మనుజులను, గుఱ్ఱములను, గాడిదలను, కుక్కలను వ్రాయుట నభ్యసింపవచ్చును. అట్టిచిత్రములను పారవేయక జాగరూకతతో నుంచిన ప్రదేశచిత్రములను వ్రాయునప్పు డివి యన్నియు మన కెంతయో యుపయోగకరముగ నుండును. పైఁజెప్పినవిధముననే యనేకవిధము లైనవృక్షములను వ్రాయుట నభ్యసించిననేఁడా ప్రవీణులము కాఁగలుగుదుము.

ఒక జలప్రవాహ మున్నది. దానిప్రాంతములయందు వివిధవృక్షము లున్నవి. ఆవృక్ష
సారి విశ్రమించియున్నాఁడు. కొంతదూరమున కొందఱుపిల్ల లాడుకొనుచున్నారు. మఱిగొ

పశువులు మేయుచున్నవి. నదియందు దోనెపడవ పోవుచున్నది. అందొక మనుజుఁడు కూర్చుండియున్నాఁడు. దూరమునందు పర్వతములు కానవచ్చుచున్నవి. ఆకాశమునందు సూర్యుఁడు తీవ్రముగ ప్రకాశించుచున్నాఁడు. కాని అచ్చటచ్చట మేఘములు కానవచ్చుచున్నవి. నదియందు చెట్లు, సూర్యుఁడు, మేఘములు ఇంక ననేకమైనవస్తువులు నీటిలో ప్రతిఫలించుచున్నవి. ఇట్టిప్రదేశచిత్రములను వ్రాసి చూడుఁడు. మీ కెంతవఱ కభ్యాసము కలిగెనో మీకే తెలియును.

కాని ప్రారంభమునందు మన యిష్టము వచ్చినటుల వ్రాయకూడదు. సృష్టియందుండు వస్తువులను చూచి చిత్రించుట నభ్యసింపవలెను. ఇటులచేయుట కొకయుపాయము చెప్పెదను.

చిత్రలేఖనమునకు కావలసిన వస్తువులను, ఒకదర్పణమును నీతో నొకనిర్జనప్రదేశమునకు తీసికొనిపోయి, యొకచోట నానించియున్న కొంచెము ప్రక్క నొకవస్తువునకు నీయద్దమును చేరువేయుము. ఆ యద్దమునందు కొంత ప్రదేశము కానవచ్చును. దానిని చూచి వ్రాయుట మీకు సులభముగ నుండును. అప్పుడు చిత్రించుట మీ కెంతయో యానందకరముగను, సులభముగను ఉండును.

వివిధములైనరంగులను వేయకముందు మీ రొకపనిని చేయవలసియున్నది. పెన్సిలుతో మీ చిత్రములను వ్రాసినతరువాతను సిపియారంగుతో ప్రధానచ్ఛాయలను చిత్రించవలసియుండును. పిమ్మట సృష్టి ననుసరించి మీరు వివిధరంగులను చిత్రమునందు వేసి, అవి యెండినతరువాతను వివరములను చిత్రించి పటమును పూర్తిచేయవచ్చును. ఇటులనే అన్నిచిత్రములను వ్రాయునది. అభ్యాసమైనకొలఁదిని చిత్రములు చక్కగ వ్రాయఁగలుగుదురు. విద్య కంతము లేదని జ్ఞాపకముంచుకొనుఁడు.



## నాల్గవ భాగము.

### మానవుల ప్రతిరూపములను రంగులతో చిత్రించుట.

ఛాయాపటములను పెద్దవిగ పెన్సిలుతో వ్రాయువిధమును చెప్పితిని. ఇప్పుడు రంగులతో చిత్రించుమార్గములను వ్రాసెదను. ఈపనిని పూనుకొనుటకు నీరురంగులను పూయుటయందు చాలప్రావీణ్యము కలిగియుండవలెను. లేనియెడల నట్టిచిత్రములు విచిత్రములుగ నుండును. ఇంతవఱకు వైనచర్మపురంగు నెటుల వేయఁగలుగుదు నని వింతపడెదవు. అంత యెందుకు? నేను చిత్రములను వ్రాసినయెడల చిత్రలేఖనవిషయమై తెలియనివారు కొంతమంది వచ్చి యీరంగులు నీకాగితముపై నెటుల నంటించఁగలిగితి వని నన్ననేకవిధములయందు ప్రశ్నించిరి. బాగుగ నభ్యాసము గలమానవుని నోటనుండి యిట్టివాక్యములు వెలువడునా? ఇట్టియభ్యాసము గలవారిదిగువ చెప్పినటుల నభ్యసించినయెడల త్వరగా మనుజులరూపములను నీరురంగులతో చిత్రించఁగలుగుదురు. మనస్సే మూలము. చిత్రలేఖనమునం దభిరుచి గలవారు అతిత్వరితముగ నేర్చుకొనఁగలిగెదరు. అందువలన విసుగుఁజెందక సంతోషముగ నభ్యసింపవలెను. కాని ఛాయనుగురించి బాగుగ తెలిసియుండవలెను. దీనికి కావలసిన పరికరములవిషయమై మొదట కొంచెము చెప్పుట మంచిది.

...ములు కావలెనో వాటి నెటుల యెంచుకొనుటయో యిదివఱకే చెప్పియుంటిని. అన్నిరంగుల ...ను వ్రాయఁజాలము. దీనికి కొన్నిరంగు లున్నవి. వీటిని రెండుతరగతులుగ భాగించవచ్చును. ...చినబట్టలకు వేయునవి. (2) చర్మమునకు వేయునవి.

### చర్మమునకు వేయు రంగులు.

(1) తెలుపు. (Chinese White)
(2) ఇండియా పసుపు. (Indian Yellow)
(3) తేలికగున ఎఱుపురంగు. (Light Red)
(4) చిందూర రంగు. (Vermilion)
(5) ఇండియా ఎఱుపు (Indian Red)
(6) బ్రౌను మేడరురంగు (Brown Madder)
(7) కోబాల్టు నీలి. (Cobalt Blue)
(8) బరంటు శియనారంగు. (Burnt Sienna)
(9) వేండికు బ్రౌనురంగు. (Vandyke Brown)

వెనుకటిభాగమునకును, బట్టకును వేయురంగులు. (ఇదివఱకు చెప్పినవి విడిచిపెట్టబడినవి.)

(1) గెంబోజి పసుపు. (Gamboge)
(2) గోపిచందనము రంగు. (Yellow Ochre)
(3) సిపియా. (Sepia)
(4) క్రిమిజను వర్ణము (Crimson Lake)
(5) కారుమైను ఎఱుపు. (Carmine)
(6) ఫరాసు నీలవర్ణము. (French Ultramine)
(7) గాజునీలి. (Smalt)
(8) ఇండిగో వర్ణము. (Indigo Tint)
(9) నీలివర్ణము. (Prussian Blue)

ఈరంగులగుణములను చెప్ప నవసరము లేదు; కాని యేయేరంగు లెందుకు పనికివచ్చునో కొంచెము చెప్పెదను.

తెలుపు అంత యుపయోగకారి కాదు. కంటెగున్నకును, ఆభరణములకును లేసు (Lace) ను చిత్రించుటకును పనికివచ్చును. కాంతి యందు మెరయునప్పుడు వస్తువులు తెల్లగ కనబడును. అట్టిసమయములం దిది సహాయపడును. ఏమైన తప్పుగా చిత్రించినయెడల నీరంగును పూసి యిదివఱకు వేసినరంగులను కనబడకుండ చేయవచ్చును.

ఇండియా పసుపురంగు బట్టలకు వేయుటకు బహుచక్కగ నుండును. దీనిని తెలుపుతో కలిపినయెడల చక్కని సువర్ణవర్ణము లభించును. కొన్నిసమయములయందు చర్మమునకు వేయుటకుకూడ పనికివచ్చును.

గోపిచందనము రంగు కొన్నిసమయములయందు జుత్తునకును వెనుకటిభాగములకును వేయుట కుపయోగపడును.

బరంటుశియనారంగు బట్టలకును, పచ్చనిప్రదేశచిత్రముల వెనుకటిభాగములకును పనికివచ్చును. ఇండిగో వర్ణముతో కలిపినయెడల నిది యాకుపచ్చనివెనుకభాగముల కత్యంతోపకారిగ నుండును.

వేండికుబ్రౌనురంగు చిత్రకారులకు చాల సహాయకారిగ నుండును. కాని యీరంగును వేసి దానిపై మఱియొకరంగును పూసినయెడల నీరంగు చెదరిపోవును. దీనిని క్రిమిజనువర్ణముతో కలిపినయెడల నీడస్థలములయందు వేయవచ్చును.

సిపియా నలుపు మట్టిరంగంత గాఢమైనది కాదు. దీనిని అభ్యాసము చేయుటకు మిక్కిలి యుపయోగించెదరు. నీలిమందురంగుతో దీనిని కలిపినయెడల దూరమున నున్నవృక్షములకు నీడయుండు దున్నవెనుకభాగములకును, తెల్లని వస్త్రములమడుపులయందు వేయుటకు పనికివచ్చును. క్రిమిజనువర్ణముతో కలిపిన బ్రౌనుమేడరు రంగువలె కానవచ్చును. ఇండిగోరంగుతోను, క్రిమిజనురంగుతోను కలిపిన చక్కని నలుపురంగు లభించును.

బ్రౌనుమేడరు రంగును నీలితో కలిపినయెడల నీడను చిత్రించుట కుపయోగపడును.

క్రిమిజను(రక్త)వర్ణము వస్త్రములను చిత్రించుట కుపయోగపడును. ఇది గట్టిగా కాగితమునకు పట్టియుండదు.

కారుమైను ఎఱుపు చర్మమునకు పనికివచ్చును. గులాబిరంగు బట్టలకు, చర్మములకు వేయుటకు మిగుల యుపయోగపడును.

ఇండియా ఎఱుపు ముఖమునందు ఛాయవేయుటకు పనికివచ్చును. నీలితో కలిపికూడ దీనిని యుపయోగించవచ్చును.

సిందూరరంగును గులాబివర్ణముతో కలిపినయెడల సౌందర్యమైనచర్మపురంగుగ నుపయోగపడును.

కోబాల్టునీలి ననేకచోట్ల నుపయోగించెదరు. తెల్లని వస్తువులయందు ఛాయను చూపుటకు విస్తారముపయోగించెదరు. ఇండియా ఎఱుపుతో కలిపినయెడల ముఖమునందు నీడను వేయుట కుపయోగపడును.

ఫరాసు నీలము బట్టలకు వేయుదురు. గాజునీలి కోబాల్టునీలినుండి చేయఁబడును. ఇది యూదామిశ్రితమైన నీలివలె కానవచ్చును.

ఇండిగోరంగు ఆకుపచ్చమిశ్రితమైననీలివలె కానవచ్చును. ఇది వెనుకభాగమునందు (back ground) వేయుటకు పనికివచ్చును. సిపియా (Sepia) తో కలిపినయెడల దూరమున నున్నచెట్లకు వేయవచ్చును. ఇంక ననేక విషయములయందివి పనికివచ్చును.

నీలిరంగును ఆకాశమునకును వస్త్రములకును వేయవచ్చును. క్రిమిజవర్ణముతో దీనిని కలిపినయెడల చక్కని యూదారంగు వచ్చును.

మనకు యిప్పుడు కావలసిన రంగులవిషయమై యిచ్చట చెప్పితిని. ఇదివఱకు మీరు చేసినయభ్యాసమునందు తక్కిన వాటితో మీకు పరిచయము కలిగియే యుండవచ్చును. అందువలన నే నిచ్చట చెప్పవలసినయవసరము లేదు.

కుంచెలు:—చర్మపురంగును వేయుటకు కుంచెలు సాధారణపు పరిమాణమును గలిగియుండవలెను. ఇవి సేబిలు రోమములతో చేయఁబడియుండవలెను. వాటికొనలు సూదిగనుండిననే చిత్రించుట కనుకూలముగ నుండును. చేతితో కొనను నొక్కిపట్టినయెడల దానిపూర్వపు ఆకారమును దాల్చుచుండుట మంచిది. కొన్నిసమయములయందు కొనలేనికుంచెలు పనికివచ్చును. ఇట్టిపనులయందు వాడుటకు సాధారణముగ ప్రాతకుంచెల నుపయోగించెదరు. చిత్రములను కుంచెలతో చిత్రించునపుడు ప్రక్క నొక్కవస్త్రమును చేతిముందుకు నుంచవలెను. ఇట్లు చేసినయెడల నొప్పి యుండదు. చేయి వణకదు. చిత్రలేఖకుఁడు తాను చేయుచున్నపని నంతను స్పష్టముగ చూడఁగలుగును.

తరగతులు:—సాధారణముగ ముఖమును చిత్రించుట మూఁడుతరగతులుగ భాగింపఁబడినది. చిత్రమును పెన్సిలుతో వ్రాసి మొదటిపర్యాయము రంగును వేయుట మొదటితరగతి. రెండవతరగతియందు ముఖమునకు గుండ్రము నిచ్చు ఛాయను, బుగ్గలకు రంగును, వెంట్రుకలకును, బట్టలకును, ప్రధానరంగును, ఛాయను వేయవచ్చును. రెండుమూఁడుతరగతులకు మధ్య చర్మపురంగును కొంచెము మృదువు చేయవచ్చును. చిత్రలేఖకున కభ్యాసము బాగుగ కలుగునంతవఱకు మనుజుని యెదుట నుండకనే రంగును వేయకూడదు. బట్టకు రంగును ఎప్పుడైనను వేయవచ్చును. మూఁడవతరగతియందు చిత్రమును మృదువుచేసి, తప్పులను దిద్దుకొని పూర్తిచేయవలయును.

ఎవరిచిత్రమును నీవు వ్రాయుచున్నావో ఆవ్యక్తి నీవు చిత్రించునంతకాలము నీదగ్గర కూర్చుండియుండవలెను. ఛాయాపటములను పూర్తిచేయుటయందు వ్యక్తి నీదగ్గరనుండ నక్కరలేదు. వానిప్రతిరూప ముండిన చాలును.

తరగతి యందంతా వ్యక్తిని దగ్గర నుంచి చూచుచు వ్రాయుట యని నా యర్థము. అందువలన పైఁజెప్పినప్రకారము వ్యక్తిని ముఖ్యముగ దగ్గరనుంచుకొని పటమును చిత్రించి పూర్తిచేయవచ్చును. వస్త్రములను, వెనుకభాగమును తదితరసమయములయందు చిత్రించవచ్చును.

### రూపముయొక్క ఉనికి. (Position)

ఎవనిచిత్రమునైతే మనము వ్రాయుదుమో వానిముఖమును అనేకవైపులనుండి చూడవలెను. ఏవైపునుండి ఆముఖము సౌందర్యముగ కనఁబడునో అచ్చోటనుండి చూచుచు మనము ప్రతిరూపమును వ్రాయవలెను. ఎవని

చాలమార్పును కలుగఁజేసెను. అప్పటినుండి మనవారు అంగరకాలను తొడుగ మొదలిడిరి. తురకల నిరంకుశపాలనముచేతను హిందువులు చాలవఱకు పరిపాలకుల దుస్తులనే ధరించుచుండిరి. ఇఁక నిప్పటి సంగతిని చెప్ప నక్కఱయే లేదు. మనజాతియుదుస్తులను విడిచిపట్టి దొరల మైపోవుచున్నాము. సిగరెట్టును, బ్రాందీని, ఉపయోగించుచున్నాము. కాని దొరలవలె మనము మానసముచే నభివృద్ధి కాలేదే?

"హేటును, బూటును, నీటుగావేసిన తెల్లదొర లెక్కగ తేఁగలండు"

అని యొకానొక కవి యిందువలననే చెప్పెను. ఇప్పు డీసంగతులు మన కెందుకు? ప్రస్తుతాంశమును చూతము.

ఇప్పటి దుస్తులను మనము ప్రేమించెదము. పూర్వకాలపువాటిని నిరసించుచున్నాము. అందువలన మనము రూపములను చిత్రించునప్పుడు యిప్పటిబట్టలను చిత్రించవలయును. ఎప్పటికిని మార్పుచెందనట్టిదుస్తుల నెంచి మనము వ్రాసినయెడల నన్నికాలములవారికిని సంతోషపుచ్చినవార మగుదుము. స్త్రీచిత్రమును వ్రాసినయెడల కోకను ధరించినట్లు ప్రదర్శించిన బాగుగ నుండును. చిత్రలేఖకుని విమర్శనమున కీవిషయమును విడిచిపెట్టుటయే మంచిది. ఒకానొకప్పు డొక స్త్రీ సుప్రసిద్ధచిత్రకారుఁడగు రేనాల్డ్సు (Reynolds) నద్దకు వెళ్లి "నాప్రతిని చిత్రించు" మని యడిగెను. అందుపైని యాతఁడు "దుస్తులపై యేయేరంగులను వేయవలె" నని యడుగఁగా నామె "ఏరంగులు బాగుగ నుండగలవి" అని ప్రశ్నించెను. "కాషాయమును, ఊదాయును" అని చిత్రకారుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "అట్లయినయెడల నాదుస్తులను కాషాయమునతోను, నాభర్తయొక్కదుస్తులను ఊదాయునతోను చిత్రింపుము." అని యామె కోరెను. పెద్దింటిస్త్రీలు మిగుల ప్రకాశమాన మైనరంగులబట్టలను ధరించుట కిష్టపడెదరని పైకథవలన మనకు తెలియుచున్నది. కాన వారివారి యిష్టముల ప్రకారము చిత్రకారుఁడు చిత్రించుటను నేర్చుకొనవలెను. ఛాయయొక్క సిద్ధాంతమును నేర్చుకొనుటకుఁగాను సర్ జోషువా రేనాల్డ్సు, వేండిక్కుల (Sir Joshna Reynolds & Vandyck) చిత్రములను చూడుఁడు.

రేనాల్డ్సు, బాలురయొక్కయు స్త్రీలయొక్కయు దుస్తులకు తెలుపును, ఎఱుపు మిశ్రితమైనపసుపును వేయుచుండెను. పురుషులబట్టలకు గాఢమైనరంగుల నుపయోగించెను.

సాధారణముగ రేనాల్డ్సుకంటె వేండిక్కు గాఢమగురంగుల నుపయోగించుచుండెను. ఈచిత్రకారుఁడు ఎఱుపును, నీలిని, పసుపుపచ్చను, బరంటుశియనా (Burnt Sienna) ను, ఆకుపచ్చను, ఊదా (Purple) ను ఉపయోగించెను. అప్పుడప్పుడు ఎఱుపుమిశ్రితమైన చిక్కనైన నారింజరంగు నుపయోగించి నీలిని ఛాయయందు కొంచె ముపయోగించుచుండెను.

నీలిని పటములను స్త్రీలు ప్రేమించెదరు. కాని యారంగును బాగుగ పూయుట ప్రథమమున కొంచెము కష్టమనిపించును. రేనాల్డ్సు వెలుతురుగ నుండునట్టి దిట్టచిత్రములయందు ఎఱుపును పసుపును వేయవలెనని చెప్పెను. ఈవాక్యములను వ్యర్థపుచ్చుటకు గైన్సుబరో (Gainsborough) తనచిత్రమునం దిట్టచోట్ల గాఢమైన బరంటుశియనాను వేసెను. కొందఱు రేనాల్డ్సుగారివాక్యములను పూర్ణముగ వ్యర్థపుచ్చిరనియు మఱికొందఱు అంత బాగుగ తమచిత్రములు నవిధముగ చిత్రించలేకపోయిరనియు చెప్పుచున్నారు.

ఇట్టిరంగులను వేండిక్కుగారు ఎట్లుపయోగించిరో కొంచెము చూతము. వస్త్రమునకు నీలిని పూసి దానివద్దనున్న చక్కపుఛాయకు బరంటుశియనాను పూసి ఎఱుపు వెనుకభాగమును నిర్మించి చిత్రమునకు సౌందర్యము నిచ్చి కీర్తి గాంచెను.

*N.B.*—ఈ **33**-వ పటమును 39-వ పేజిలో 4-వ పంక్తి పైన నున్నటుల దలంపవలయును.



1









2

33

దుస్తులయందలిఛాయను బాగుగ ప్రదర్శించుటకు గాను రెంబ్రంటు (Rembrant) గారు నలుపువస్త్రములను సాధారణముగ చిత్రించుచుండిరట. అందువలన గొప్ప చిత్రకారులచే చిత్రింపబడిన పటములను మనము సదా పరిశీలించుచుండవలెను. **34**—చూడుము




వెలుతురు:—చిత్రకారులు [illegible] రును వెళ్లకూడదు. ఇట్టిగదుల కొకద కిటికీయును [illegible] మూయబడి యుండవలెను. కిటికీద్వార [illegible] చాలును. ఇటుల చేసినయెడలగాలియు లోనికిరాజాలవు.

ఈగదికి ఉండుకిటికీ ఆఱుఅడుగుల [illegible] లెను. అచ్చటనుండి నన్నువెలుతురెచ్చో [illegible] మునందు చిత్రకారుడును, వ్యక్తియు కూర్చుండియుండవలెను. వ్యక్తియొక్క ముఖముపై వెలుతు [illegible] యెడల ముక్కును బాగుగ చిత్రించనగును. ఛాయను దట్టముగ చిత్రించవలసి యుండును. అందు నలువుగ నుండిన నీఛాయయొక్క గాఢత కొంతవఱకు తగ్గిపోయి చిత్రమునకు ప్రత్యేకసౌందర్యము [illegible] చిత్రములయందిట్టివి మనము సాధారణముగ చూచుచుందుము. చిత్రకారుని ఎడమవైపునుండి [illegible] నటుల చూచుకొనవలెను. ఏలయన: కుడిచేతిఛాయ కాగితముపై పడదు. అందువలన చిత్రే

గలుగదు. చిత్రమును వ్రాయునపుడు దగ్గర నెవరు నుండకూడదు. స్త్రీయొక్క ప్రతిరూపమును వ్రాయునపుడు మాత్రము మఱియొక మనుజుఁడైనను స్త్రీయైన నుండినయెడల నపవా దేమియు రాదు.

చిత్రములను వ్రాయుట :—మొదట మంచి ప్రతిరూపమును పెన్సిలుతో వ్రాయవలయును. ముందు చిత్రింపఁబోవుచిత్ర మంతటికిని యిది యాధార మైయుండును. అందువలన పెన్సిలుతో వ్రాయుచిత్రమునందు తప్పు లున్నయెడల కష్టమంతయు వృథా యైపోవును కదా! కాన దీనిని శుభ్రముగ పెన్సిలుతో వ్రాయుటయం దెంతకష్టమైనను పడవలెను.

పెన్సిలుతో వ్రాయునప్పు డనేకచోట్ల రబ్బరుతో చెరుపవలసియుండును. అందువలన కాగితము చెడిపోవును. దానిపై రంగును వేసినయెడల చాల దట్టముగ నంటుకొనును. ప్రథమమున నొకకాగితముపై చిత్రమును వ్రాసి మఱియొకకాగితముపైకి దానిని దించవలసియుండును. ప్రస్తుతము చిత్రమును వ్రాయుటను చెప్పెదను.

తలయొక్కస్థితి నొకగీతవలన తెలియఁజేయవలెను. పూర్ణముఖ మున్నయెడల తిన్ననిగీతను కొంచెము ప్రక్కకు త్రిప్పియున్న ముఖమునకు కొంచెము వంకరగీతయు వ్రాయవలసియుండును. ఈగీతకు సమకోణముగ నొకగీతను వ్రాయవలెను. ఈ రేఖ కండ్లమధ్యద్వారా వెళ్లవలెను. ఈవిధముననే మెల్లగ ముక్కునకును, నోటికిని, గడ్డమునకును గీతలను గీయవలెను. వీటిసహాయముద్వారా ముఖముయొక్క రూపమును 33—వ బొమ్మలో చూపినప్రకారము వ్రాయవలెను.

పిమ్మట చిత్రములను చక్కఁజేసికొని రావలెను.

ఈచిత్రము ముఖమునకు సమానముగ నున్నదో లేదో చూడవలసియున్నది. దీనికిఁగాను నీచిత్రమును ఒక అద్దమునందు ప్రతిఫలింపఁజేయుము. ఏమైన తప్పున్నయెడల వెంటనే తెలిసిపోవును.

తరువాత నాచిత్రముమీఁద నొకపలుచని కాగితమును వేసి కదలిపోకుండ పెన్సిలుతో కాగితముద్వారా కనఁబడుచున్నచిత్రము నాపలుచనికాగితముపై వ్రాయుము. ఈవిధముగ మీరు చిత్రమును మఱియొకకాగితము [illegible]లుగుదురు. ఇది యిట్లుండ నొకవళసరికాగితముపై గోపిచందనపురంగును దట్టముగపూసి అదియారిన [illegible]చిత్రమును తీసి దీనిపై వేసి పెన్సిలుతో గట్టిగ దిద్దవలెను. ఇట్లు చేసినయెడల నీచిత్ర మున్న[illegible]పున గోపిచందనపుగీతలతో మఱియొక ప్రతిరూపము వచ్చును.

నీవు చిత్రమును వ్రాయఁదలంచితివో ఆకాగితముపై జాగరూకతతో నీచిత్రము నుంచి దానిపై [illegible]రం గాకాగితముపై నంటుకొనును. అప్పు డీకాగితమును జాగరూకతతో తీసివేయవలెను. [illegible]సిలుతో నారంగు ననుసరించి చిత్రమును వ్రాయవచ్చును. చేతిరుమాలతో నీరంగును తుడిచి [illegible]ప్పుడు నీచిత్రము రంగులువేయుట కనుగుణముగ నుండును. గోపిచందనమురంగు పూసినకాగిత [illegible]చినయెడల మఱియొకపర్యాయమునను పనికివచ్చును. కాని యీమార్పులయందు చిత్రముయొక్క [illegible]ము పాడుచేయరాదు. పైఁజెప్పినదంతయు వ్రాయుంగు కాగితమును శుభ్రముగ నుంచుకొనుట [illegible]వలన నభ్యసించువారు కాగితమును శుభ్రముగ నుంచుకొందురు గాక. గొప్పచిత్రకారు లీవిధము [illegible]మన్నారు.

[illegible]థమమున వ్రాయు చిత్రమును పెద్దదిగను చిన్నదిగను చేయుటకు యిదివఱకే యుపాయములను [illegible]కారము చిత్రకారులు తమతమ యిష్టముల ప్రకారమును, స్థితిగతులనుబట్టియు, తమచిత్రములను [illegible]యందు వ్రాసుకొనవచ్చును.

[illegible]గాయుట :—ఒక గొప్పచిత్రకారుఁడు. "మొదట వెలుతురు పడినచోట్లయందు తెలుపును, [illegible]చ్చను, తుదిని గాఢమైన ఎఱుపును ఛాయ ననుసరించి వేయవలెను. ఎచ్చట ఛాయ దట్టముగ [illegible]గ్రేవర్ణమును పూయవలెను" అని చెప్పెను.

ముఖము బల్లపరుపుగా నుండదు. ఇట్లుండినయెడల చిత్రించుట చాలసులభమైపోయియుండును. కాని యిది గుండ్రముగ నుండును. అందువలన మనము ఎత్తుపల్లములను చిత్రించి ప్రకృతి ననుసరింపవలసియుండును. ఈయెత్తుపల్లములను చూపుటయే మిగులకష్టము. ఆభేదములను మనము బోధపఱచుకొనుటకు మీామేజాబల్లలపై తెల్లనిరాతిప్రతిమను సదా యుంచుకొనుట మంచిది. ఇది మనకు మిక్కిలి సహాయకారిగ నుండును.

విద్యార్థి యీాదిగువచెప్పినవి మొదట బోధపఱచుకొనవలసియుండును.

ప్రకృతియందు గలవస్తువులు ఛాయనుబట్టియు రంగునుబట్టియు విడివిడిగ మనకు కానఁబడును. ఈఛాయ లేనియెడల నన్నియు వివిధరంగులుగల ఒకేవస్తువుగ కనఁబడును

వెలుతురునం దుండువస్తువులనీడయం దుండువస్తువులు కొంచెము నల్లగ కానఁబడును. ఛాయకూడ దట్టముగ నుండును.

దూరముగ నున్నవస్తువులకంటె దగ్గరగనున్నవస్తువులు బాగుగ కనఁబడును. వీటిరంగులుకూడ దట్టముగ నుండును. దూరము వృద్ధియైనకొలఁదిని రంగుయొక్క దట్టము తగ్గుచుండును. మధ్య నున్నవస్తువులు సాధారణముగ కానవచ్చును.

దట్టమైనఛాయ నలుపువలె నుండును. గులాబివర్ణపువస్తువుయొక్క ఛాయ ఎఱుపుగ నుండును. వీటియంచులు బూడిదవర్ణపురంగును గలిగియుండును. అంచులయం దుండుభాగములు కొంచెము నల్లగ కానవచ్చును. ఈయంశములను ముఖమును చిత్రించునపుడే అనుసరించవలెను.

రంగులను సిద్ధముచేయుట :—చర్మమును చిత్రించుటకు ఈదిగువ చెప్పినరంగులను విడికుడికలయందు పలుచగ నరుగఁదీసి సిద్ధముగ నుంచవలెను.

(1) ఇండియాపసుపు. (2) తేలికయైన ఎఱుపు. (3) వెర్మిలియను.
(4) గులాబిరంగు. (Pink Madder) (5) బ్రౌనుమేడరు. (6) ఇండియా ఎఱు
(7) కోబాల్టునీలి. (8) సిపియా.

ఈపైని చెప్పినవి కాక చర్మమునకు వేయు ఎఱుపు, నీలి, పసుపులతో తయారు చేసికొనియు ఎవరియు దేశముప్రకారము వారు రంగులను తయారుచేసుకొనవచ్చును. దీని కేవియు నిబంధన లే

కొందఱు పైచెప్పినరంగు నుపయోగింతురు. మఱికొందఱు ఈరంగుల ద్వారా యీసరిం చేయుదురు. అందుకుగాను కొన్నిశుభ్రమైన కుడికలను మంచిజలమును దగ్గఱ నెల్లపుడు నుంచుకొనుట

ప్రథమతరగతి :—రంగులను వేయుట మూఁడుతరగతులుగ భాగింపవచ్చునని యిదివఱకే చక్కనిముఖమును చిత్రించుట నీదిగువ చెప్పెదను.

ఇదివఱకు చెప్పినప్రకారము చిత్రమును వ్రాసి రబ్బరుతోనైనను, రొట్టెతోనైనను పెన్సిలు వేయవలెను. కాని కొంచెము గీతలు కనఁబడుచుండవలెను. ఇటుల చేసినయెడల యీగీత లేమియు తరువాత కానరావు. పిమ్మట కుంచెతో ముఖ్యమైనచోట్ల రంగులు వేయవలెను. ఇటుల ప్రథమ యెడల పెన్సిలుగీతలయనసర ముండదు. సిపియాతో కనుబొమలను, కోబాల్టుతోను సిపియాతో వేండిక్కు బ్రౌనురంగుతో కంటిపాపను చిత్రించవలెను. బ్రౌనుమేడరురంగుతో నాసికయొక్క చ వలెను. చేతినికూడ యీరంగుతోనే చిత్రింపవలెను. బ్రౌనుమేడరు రంగుతోను, గులాబిరంగుతో ధ్రములను నోటియొక్క మధ్యభాగమును చూపవలెను.

పిమ్మట చర్మపురంగును ముఖమునకువేసి తేలికయైనఎఱుపురంగును కోబాల్టును కలిపి నాసికక్రిందను గడ్డమునకును చెవికిని యివ్వవలెను. కోబాల్టుతో క్రిందిపెదవిదిగువను చిత్రించవ

దట్టము చేయవలెను. ముఖ్యముగ నిప్పుడు మొదట వేసిన రంగులను శుభ్రపఱుచుటయే ప్రధానమైనపని. ఈవిధముగ చర్మపురంగు నభివృద్ధిపఱచి జుట్టును చిత్రించుటకు పూనుకొనవలెను ఇదివఱకు వేసినరంగును సిపియాతోను, న్యూట్రలు టింటు (Neutral Tint) తోను అభివృద్ధిపఱచి వెండ్రుకలను ప్రదర్శింపవలెను.

వెండ్రుకలసమూహమును వాటిమెఱపును చక్కగ చిత్రించవలసియుండును. కనుక విద్యార్థి యీవిషయమై మిక్కిలి శ్రద్ధ వహించియుండుట మంచిది. మొదట బరంటుశియనారంగు గలవెండ్రుకలను చిత్రించువిషయమై చెప్పెదను. దీనికి వేండిక్కుబ్రౌనురంగును, సిపియాను కలుపవలెను. వేయునప్పుడు విస్తారము గీతలుగాను లేక యేకముగాను వేయఁగూడదు. కొంచెము కొంచెము గీతలుగా నుంచవలెను. కొంచెము మెఱయునప్పుడు చిన్నగీతలు మాత్రము కానవచ్చును. మెఱయుచోటునందు పలుచని నీలిరంగును వేయవలెను. దానిమీఁదను చర్మపురంగును వేసి సిపియాతోను వేండిక్కు బ్రౌనురంగుతోను వెండ్రుకలను చిత్రింపవలెను. నల్లని వెండ్రుకలకు మొదట సిపియాను, నీలిని వేసి ఇండిగోరంగును, క్రిమిజను లేకను, సిపియాను కలిపి నలుపు రంగును తయారుచేసి ఛాయ యున్న చోటులయందు వేసికొనిరావలెను. నలుపువెండ్రుకలు మెఱయుచోటునందు నీలిని వేయుడు.

మఱియొకవిధముగ జుట్టును చిత్రించవచ్చును. ప్రథమమున సిపియాను వేసి వేండిక్కుబ్రౌనురంగును సిపియాను కలిపి ఛాయ నివ్వవలెను. తరువాత గోపిచందనపురంగును, ఇండియాపసుపును, తేలికయైనఎఱుపును వేయవచ్చును. ఇట్టివెండ్రుకలు మెఱయుచోట పసుపును వేసి ఛాయను గ్రేనర్గముతో నివ్వవలెను ఈవిషయము నిటులనుంచివేసి మోమును, చేతులను చిత్రించుట మంచిది.

చర్మమునకును, వెండ్రుకలకును మధ్య నుండు స్థలమునకు గ్రేనర్గమును వేయవలెను. ఈరెంటికిని విస్తారము భేదమును కనఁబఱుపకూడదు. జుట్టుయొక్క అంచులకును నారంగునే వేయవలెను. లేనియెడల ప్రతిమవలె నుండును కాని, జీవకళను కలిగియుండదు.

ప్రథమమున చర్మపురంగు వేసి వెలుతురు గలచోటున నీలిని, ఛాయయందు తేలికయైనఎఱుపురంగును, నీలిని కలిపి వేయవలెను. ఈవిధముగనే చేతులకును, ఇతరస్థలములకును రంగులను వేయవలెను. వేళ్లను భేదమును చూపుటకు మధ్యను వేండిక్కుబ్రౌనురంగును, గులాబిరంగును వేయుట మంచిది. వ్రేళ్లకీరంగులు సౌందర్యము నిచ్చును. వ్రేళ్లకొనలును, వ్రేళ్లకణుపులును, అఱచేతులును ఇతరస్థలములకంటె కొంచెము గులాబిరంగుగ నుండును. అందువలన నీస్థలములకు గులాబిరంగును, ఎఱ్ఱిలియను రంగును వేయవలెను.

పిమ్మట బట్టలకు ఏకముగ నారింజరంగును వేయవలెను. ఛాయ నిప్పుడిచ్చుట యవసరము లేదు.

మూడవతరగతి:—ఇప్పుడు కాగిత మంతయు రంగులతో నిండియున్నది. చిత్రములయొక్క రూపు కొంత వఱకు తేలెను. కాని యింతటితో సరిపోలేదు ముఖముగుండ్రముగ కనఁబడుటకు ఇంకను రంగులను వేయవలెను. ఛాయను కనపఱుపవలెను. పూర్తిచేయుటయే మిగిలియున్నది.

నీచిత్రమును కొంచెము దూరమునుండి చూడుము. ఎచ్చటెచ్చట రంగులను వేయవలయునో నీకే తెలియును. మీఁదినుండి (అనఁగా: కంటినడ్డనుండి) రంగును వేసికొని రావలెను. కంటిమీఁదిరంగు విస్తారము ఊదాగనున్నయెడల ఆకుపచ్చరంగుతో దిద్దుకొనుము. దిద్దుటలో విస్తారము ఆకుపచ్చగ నైపోయినయెడల చర్మపురంగును దానిపై వేయుము. కంటిపాపయందు వేయఁబడిన నీలియొక్క గాఢత్వమును సిపియాతోను, కోబాల్టుతోను తగ్గించవచ్చును. తెల్లనిభాగములయందు విస్తారము నీలి యున్నయెడల, తెల్లనిరంగును వేసినయెడల మంచిది. కంటియందు ఆకుపచ్చరంగును వేసియుండిన చర్మపురంగుతో సవరింపవచ్చును. పిమ్మట కనుబొమ్మలను సిపియాతో దిద్ది నలుపు నచ్చటచ్చట వేసి వాటికి సౌందర్యమును కూర్పఁగలము. కంటినఖువైపులు వేండిక్కురంగును వేసి దిద్దుకొనవగును.

ప్రతిభాగమును గుండ్రముగ చేయవలెను. ఈరూపము నిచ్చునది ఛాయ యని మీ కిదివఱకే తెలియును. అందువలన ఛాయను తప్పులు లేకుండ చక్కగ చిత్రించుటయందు జాగరూకత వహించి యుండవలెను. ప్రతిఛాయకు క్రొన్నర్ణపుటంచు ఉండు నని మాత్రము మఱచిపోకూడదు. చాలవిస్తారము ఆకుపచ్చగ నుండిన ఊదాతోను, ఊదాగ నుండిన నాకుపచ్చతోను, నీలిగ నుండిన నారింజరంగుతోను దిద్దుకొనవలెను. చర్మపురంగు ఆకుపచ్చగ నుండిన నెఱుపుతో సవరించవలెను. గుండ్రముగ నున్నస్థలములయందు బూడిదవర్ణము పూయవలెను. నోటియొక్క యిరుపైపులను ఛాయరంగును వేసి అంచులను నీలితో చిత్రించవలెను. గడ్డముయొక్క క్రిందిభాగమునం దుండు దట్టమైనఛాయ నీలిమిశ్రితమైనసిపియారంగుగ నుండును. నొసటిమీఁదిఛాయయొక్క అంచు ఆకుపచ్చగ నుండును. చెవియం దుండుఛాయ ఒక్కిలి దట్టముగ నుండును. కనుక ఎఱుపుకూడ కొంచెము వేయవలసి యుండును. చిత్రించుట పూర్తియాయెను. ఇకను ఏయంశముల ననుసరించి పైచెప్పిన దంతయు చెప్పఁబడెనో విద్యార్థి తెలుసుకొనుట మంచిది.

తెలుపు, పసుపు, పచ్చ, పలుచని ఎఱుపురంగులు ఛాయయందు కొంచె మెఱుపుగ కనఁబడును. నీలి చాలవఱకు నుపయోగించితిమి. చర్మపురంగుపై నీలిని వేసినయెడల బూడిదవర్ణముగ మాఱి చిత్రమునకు సౌందర్యమును గలుగఁజేయును. పైచెప్పినచర్మపురంగు లన్నియు ప్రథమరంగుల (ఎఱుపు, నీలి, పసుపు పచ్చ) ననుసరించియే యున్నవి. సదుపాయముకొఱకు ఎఱుపునకు బదులుగా తేలికైన ఎఱుపురంగును, గులాబిరంగును, చిందూరపురంగు నుపయోగించితిమి కాని ప్రథమరంగులుమాత్రము చాలును. ఈమూఁడురంగులతోనే చిత్రించుట కష్టమైనపని. అభ్యాస ముండిననే కాని యిటుల చేయఁజాలరు. అనేకరంగులు మనకు లభించుసమయమున నీమూఁడురంగులతోనే కాలము గడుపుట ఎందుకు?

వాటుమెన్సు డ్రాయింగుకాగితము (Whatman's Drawing Paper) మీఁదను వ్రాయుట యత్యానందముగ నుండును; కాని యీకాగితమును నున్నగచేయుట కుపాయ మాలోచింపవలసియున్నది

నీచిత్రము నొక నున్ననిఫలకముపై నిదివఱకు పైచెప్పినప్రకార మంటించి దానిపై నున్ననిపలుచనికాగితమును (Tissue Paper) బిగువుగా తగుల్పవలెను. పిమ్మట నొకతాళముచెవితో నైనను, నున్నని యుంగరముతో నైనను, జాగరూకతతో నణచి వ్రాయవలయును. కాగితము చినిగిపోకుండ, గీతలు పడకుండ చూచుకొనవలెను. ఇటుల కొంతకాలము చేసినయెడల చిత్రము నున్నగ నైపోవును ఇటుల నెంత చేసిన నంత నున్న నౌను.

నెలుపునుపుకోటలను మొదట రంగు వేసినప్పుడు విడిచివేయుటకంటె, రంగు పూర్తియైనపిమ్మట తీసివేయుట మంచిది. ఆస్థలమును నీటితో గుఱుతు పెట్టుకొనవలెను. శుభ్రమైనయొకకుంచెను శుభ్రమైననీటిలో ముంచి ఆస్థలము నలుపైపుల నీటిగీతను గీయవచ్చును తరువాత తడిగుడ్డతో నైనను, చిన్నరొట్టెముక్కతో నైనను మెల్లగ తుడువవలెను. ఇట్టిరొట్టె యందు రంగేమియు నుండరాదు. దీనిని తడిగుడ్డతో కప్పియుంచుట మంచిది. ఇట్టిదానితో ఆరేడు నిమిషములు చెరిపిన చాలును.

కంటిపాప మెరయుచుండును. అచ్చోట తెల్లగ కానవచ్చును. అందువలన నీస్థలమునందు తెలుపురంగును వేయవలెను. దట్టముగ తెలుపురంగు నదుగదీసి, సన్ననికుంచెతో నీరంగును తీసి జాగరూకతతో వేయవలెను. కంప్లు ముఖ్యము. అందువలన నీవిషయమై మిగుల శ్రద్ధను పుచ్చుకొనవలెను.

వెనుకభాగమునకు మెరుగు నివ్వవలె నన్న బంకను దీనిపై పూయవచ్చును. ఒకభాగము మంచిబంకను, ఏడు భాగముల పరిశుభ్రమైననీటియందు కలిపి వేయవలెను. ఎంతకొంచెముబంక నుపయోగించిన నంతమంచిది. చిత్రము పూర్తియైనవఱకు నీపనికి పూనుకొనరాదు.

పైచెప్పిన వన్నియు సౌందర్యమైనముఖమును గూర్చియే. కొందఱిముఖములు ఆకుపచ్చగను, మఱికొందఱివి

ఊదాగను ఉండును. కొందఱిముఖములను ఎఱుపుతో విస్తారము చిత్రింపవలసియుండును. విస్తారము నల్లగనుండు ముఖములయందు న్యూట్రల్ టింటును, నీలిని, వేండిక్ బ్రౌనును, బరంటుశియనాను వేయవలసియుండును.

తెలుపురంగు, లేసును, ముత్యములను, బంగారుపువస్తువును చిత్రించుటకు పనికివచ్చును. ఏమైనతప్పులను దిద్దుకొనుట కీరంగు మిగుల నుపయోగపడును. కాని కొంచెమే యుపయోగింతురు. ఇదివరకు వేసినరంగు లేమైన కనఁబడకుండునటుల చేయవలయు నన్న నారంగులపై దీనిని దట్టముగ వేసిన చాలును.

కన్ను:—పెదవులును, కన్నులును, భావమును తెలియఁజేయును. మనుజుల నాకర్షించును. ముఖమున కివియే సౌందర్యము నొసఁగూర్చును. పెదవులకంటె కన్నులెక్కువముఖ్యమని నా యుద్దేశము. ఇట్టి యవయవములవిషయమై కొంచెము నేర్చుకొనుట మంచిది. వీటిరూపు వయస్సునుబట్టి మారుచుండును. బాలురకన్నులు గుండ్రముగ నుండును. వయస్సు ఎక్కువైనకొలది గుండ్రము తగ్గుచుండును. యౌవనాదికన్నులు భావముతో నిండి యుండును. కొంచెము మోటుగ నుండును. స్త్రీల కన్నులో, మృదువుగను, ప్రకాశముగ నుండి యొకవిధమైనకనికరమును ప్రదర్శించు చుండును. విచారముగను, సంతోషముగను నుండునసమయమునం దీకన్నులు దృష్టులు వివిధాకృతులను దాల్చుచుండును. వీటిద్వారా సిట్టిభావమును మార్చుట మిక్కిలికష్టము. ఇట్టిసమయములయందు పురుషులకన్నులు కొంతవఱకు చిత్రింపవచ్చును; కాని స్త్రీలకన్నులను వ్రాయుట కష్టము. కొంచెము తేడావచ్చిన కలిపోయిన యెడల భావ మంతయు నశించును. అందువలన ప్రారంభమునందు విద్యార్థులు మిగులజాగ్రత్తగ నుండవలెను!

స్త్రీలకన్నులయందు ప్రకాశమును కనఁబఱుపవలెను. అందువలన ఛాయను, వివరములను చూపవలసియుండును. ఇది అన్నిటికంటెను కష్టము. కన్నులను చిత్రించునపుడు కొన్నిగీతలను విడిచి వేయవచ్చును. భావమున కనుగుణముగ నుండుగీతలనుమాత్రము విడిచిపెట్టుటకు వీలుండదు. ఇటులచేసిన యెడల చిత్రమంతయు నశించును.

నొసటిమీఁద వెలుతురు పడుచున్నటులైన కొన్నిసమయములయందు నయనములు ఛాయచే కప్పఁబడియుండును. ఇట్టిసమయమునందు వీటిని చిత్రించుట కొంచెము సులభమే. రోగులయొక్కయు, వృద్ధులయొక్కయు, కన్నులు కొంచెము లోతుగ నుండును. అందువలన నీకన్నులపై ఛాయ దట్టముగ నుండును కాన వీటిని సులభముగ చిత్రించుట అంతకష్టము కాదు. కాని వృద్ధులకన్నులయందు వార్ధక్యమును, రోగులకన్నులయందు రోగమును చూపవలసియుండును.

అన్నిస్థలములకంటె కన్నులవద్ద విస్తారము ఛాయయుండును. కాని యది అన్నిఛాయలతోను కలిసియుండి ముఖముయొక్క రూపమును పాడుచేయదు.

నల్లనిముఖముయొక్క కనుబొమలు సాధారణముగ నల్లగనుండును. కాని వీటిని అంతనల్లగ ప్రదర్శింప వీలుండదు. వీటిఅంచులు దట్టముగ నుండక ప్రసన్నముగ నుండును. మధ్యను మాత్రము నలుపును వేయవలెను. సహజమయమైన నలుపును, లేత నలుపును, ఎఱుపును పసుపుపచ్చను ఉపయోగించెదరు. ముసలివారి కనుబొమలు మిగుల ఎత్తుగ నుండును. కొన్నిసమయములయందు పండిపోవును. రాలిపోవును. మఱికొన్నిసమయములందు విస్తారము దట్టముగ పెరుగును. ఇతరసమయములం దచ్చటచ్చటమాత్రము రాలిపోవును. కనురెప్పవెండ్రుకలవిషయమై యేమియు చెప్పుటకు వీలులేదు. ఇవి సంకరగనుండును. క్రొత్తవారు వీటిని విస్తారము దట్టముగ చిత్రింతురు. ఆ అభ్యాసమునుండి తప్పించుకొనవలెను.

కంటిలోపలిమూలయందు ఎఱ్ఱనిమాంసపుకండ కానవచ్చుచుండును. దీనిని చిత్రించుట కెంతయోజాగ్రత్త కావలసియుండును. కంటిక్రింద నున్నచర్మము మిగుల పలుచగనుండును. ఛాయచే కప్పఁబడి యుండును. దీనికి గ్రేవర్ణమును ఊదాను వేసెదరు. ముసలికాలమునం దీరంగులు ఆకుపచ్చగ మాఱుచుండును.

నోరు:—కన్నులవలెనే వయసునుపట్టి దీనియాకారము మాఱుచుండును. బాల్యమునం దిది గుండ్రముగను,

పుష్టిగను ఉండును. బాలురు స్తనములనుండి పాలనుపీల్చుట కీయాకారము మిగుల ననుగుణముగ నుండును. ఈవయస్సునందు నోరు భావమును ప్రదర్శింపదు. వీరు కన్నులలోనే సాధారణముగ నవ్వుచుందురు.

పండ్లు పుట్టినప్పటినుండి నీనిరూపు మారిపోవును. అప్పటినుండి కన్నులతోఁగలసి యిది భావమును ప్రదర్శింపుచుండును. వార్ధక్యమునం దీపండ్లు రాలిపోవును. కాన పెదవులు లోపలికి క్రుంగిపోవును. అప్పటినుండి నోటిరూపును, భావమును చెడిపోవును.

బాలురయొక్కయు, యువకులయొక్కయు నోళ్లు మిగుల పుష్టిగను, రక్తవర్ణముగ నుండును. సిగరెట్లను పీల్చిన నివి నల్లగ మారిపోవును. రెండు పెదవులకును మధ్య నుండు రేఖయును, పెదవులకొనలయం దుండు ఛాయను భావమును మిగుల శ్రద్ధతోఁ ప్రదర్శించుట యవసరము.

కన్నులను, పెదవులను, భావమును వ్యక్తపఱచును. కనుక కన్నులయం దెట్టిభావ ముండునో నోటియందు నట్టి భావమునే కనపఱుపవలెను.

ముక్కు:—కన్నులమధ్య నుండుస్థలమునుండి ప్రారంభించును. ఇచ్చట లోతుగ నుండి కొనయందు మిగుల నెత్తుగ నుండును. ముక్కు మిగుల మెఱయుచుండును. ఈమెఱపు కొనయందు విస్తారము. నాసికారంధ్రముల యందు ఛాయ అతిస్పష్టము. దీనికిగాను నలుపును, వేండిక్కబ్రౌనును, బరెంటుశియనాను, నీలిని ఉపయోగించెదరు.

ముక్కుకూడ కొంతవరకు ముఖముయొక్క భావమును కనఁబఱుచును. కొన్నిసమయములయందు నాసికారంధ్రములు గుండ్రమైన యాకారమును దాల్చియుండును. సంతోషసమయమునందు మిగులనెడల్పుగా నుండును.

నాసికవలన ఛాయ విస్తారముగ ముఖమునందు కానవచ్చును. ఈఛాయవలన ముక్కు యెత్తుగ నున్నటుల ప్రదర్శింపవలెను. ఈఛాయవలననే దీని కొనయాకారమును చిత్రమునం దియ్యవలెను.

చెవి:—దీనిని చిత్రించుటయందు సుప్రసిద్ధచిత్రకారులు శ్రద్ధ వహించలేదు. వారి నడిగినయెడల "దీనికి భావము లేదు. అన్నియు ఒకేవిధముగ నుండును. దీని నెటుల చిత్రించినను రూపునకేమియు మార్పును గలుగ జేయదు. అని చెప్పుచు వచ్చిరి. దీనికి భావము లేదన్నది నిజమే. కాని అన్నిచెవులు ఒకేవిధముగ నుండు ననిన నే నొప్పుకొనను. ఏవైపున వెలుతురు పడునో ఆవైపున నున్నచెవిని మిగుల జాగరూకతతోఁ చిత్రించవలెను. సాధారణముగ నివి తలవెండ్రుకలచే కప్పఁబడి యుండును.

చెవియం దనేకము లెత్తుపల్లము లున్నవి. దీనిచర్మము మెఱయుచుండును. అందువలన నందు ఛాయను చిత్రించుట కొంచెము కష్టము కాని మొత్తముమీఁద నిది అంతముఖ్యమైనది కాదు.

బాలురచెవులు గుండ్రముగ నుండును. వయస్సు ముదిరినకొలంది నివి కోలనై పోవును.

జుట్టు:—ముఖమువలెనే యీజుట్టు సర్వదా యొకేరూపును దాల్చి యుండదు. వారివారి యిష్టములప్రకారము పురుషులు కాని స్త్రీలు కాని దీనిని దువ్వెదరు. ముఖముయొక్క ఛాయనుబట్టి దీనిఛాయ మారుచుండును. మెరయుచోటులం దనేకరంగులను వేసెదరు. దీనివిషయమై యిదివరకే చెప్పితిని.

పాపటను జాగ్రత్తగ చర్మపురంగుతోను, జుట్టునకు వేఱురంగుతోను చిత్రించవలసి యుండును.

మెడ, భుజములు:—భుజములయొక్కయు మెడయొక్కయు రంగులు ముఖముమీఁద నుండునంతదట్టముగ నుండవు. సుందరాకారులయొక్క మెడయు భుజమును ముఖముయొక్క రంగులను చెందియుండును. ఇట్టిసమయములయందు ముఖమునకు వేసినరంగులనే వేసి కొంచెము కళను తగ్గించవలెను. లేనియెడల ముఖముయొక్క ప్రాముఖ్యము తప్పిపోవును.

దురభ్యాసములు గలవారియొక్కయు, రోగులయొక్కయు మెడమీఁదిదుమ్ములు స్పష్టముగ కనపడును. ఇవి

ముఖముయొక్క సౌందర్యమును పోగొట్టును. అంగములకు వికృతాకారమును కలుగఁజేయును. అందువలన చిత్రకారుఁడు వీటిప్రాముఖ్యమును తగ్గించి పటముయొక్క సౌందర్యమును నిలుపునుగాక !

మెడమీఁదిఛాయ దట్టముగ నుండును. దీనికి గ్రేవర్ణమును, ఎఱుపును ఉపయోగించెదరు.

భుజములను, మెడను, రొమ్మును, చిత్రించునప్పుడు ఛాయద్వారా స్నాయువులను ప్రదర్శించి అంగములకు గుండ్రతనము నివ్వవలెను.

చేతులు:—చేతులను సాధారణముగ చర్మపురంగుతో చిత్రించి గ్రేవర్ణముతో ఛాయ నిత్తురు. ఏచిత్రమునైన చూచి చిత్రించుటకు మంచిచిత్రము లేమియు లేవు. గొప్పచిత్రకారు లందఱు చేతులను, చిత్రించుటయందంతశ్రద్ధను వహింపలేదు. కావులవలెనే వీటికిని అశ్రద్ధతో విడిచివేసిరి. అందువలన మన కేమియు ఆధారములు లేవు.

దీనికి కారణ మిది. ముఖ ముండినచోటున నివి సందర్భానుసారముగ నుండును. అందువలన వీటిని చిత్రించెదరు. మనకు కావలసినది ముఖమే. ఇ వంతముఖ్య మైనవి కావు. అందువలన వీటి నెవరును చక్కగ ప్రదర్శింపలేదు. ఆకారమును మాత్రము చూపినారు.

స్త్రీలచేతులు పురుషులచేతులకంటె సౌందర్యముగ నుండును. పురుషునకు వలెనే స్త్రీయువాటిలో ఇవి కూడ ముఖ్య మైనవి. అందువలననే పలుచోట్ల మనపూర్వీకులు వీటిని మోహనాస్త్రములుగ వర్ణించిరి. వేండిక్కును (Vandyck) లారెన్సును (Lawrence) మాత్రము వీటిని బాగుగ చిత్రించిరి.

ఇం కొకసంగతిని గమనించవలసియున్నది. కుడిచేతితో స్త్రీలు సదా పని చేయుచుందురు. అందువలన నీచేయి కొంచెము మోటుదేరి యుండును. అందువలననే ఎడమచేతి సౌందర్యము హెచ్చు.

దుస్తులు :—వస్త్రములనుకూడ జుట్టువలెనే చిత్రించవలెను. మొదటప్రధాన మైనముడుతలను తేలికైన రంగుతో చిత్రించుట మంచిది. ఇవి సమముగా నున్న వని నీకు తోచినపుడు గాఢముగ రంగులను వేసి ముడుతలను, ఛాయను, వెలుతురును చూపుట మంచిది.

బట్టలను ఉన్నితోను, పట్టుతోను, నారతోను, దూదితోను నేయుదురు. చూచినవెంటనే దేనితో చేయఁబడినదో పోల్చివేయుదురు. ఈభేదములను చిత్రములందు చూపవలసియుండును. వీటిముడుతలనుబట్టి సాధారణముగ మనము వీటిని పోల్చెదము. తరువాతను, ఛాయను, వెలుతురును, మెఱుపును, మనము విమర్శింపవలెను. ఈ యంశములవిషయమై కొంచెము జాగ్రతగ నుండవలెను. చిత్రమునందు చూచినవెంటనే దేనితో చేయఁబడినవస్త్రమో మనము పోల్చివేయవలెను.

తెల్లవస్త్రములయొక్క ఛాయ వెనుకభాగముయొక్క రంగునుబట్టి యుండును. వెనుకభాగము ఆకుపచ్చగ నుండిన ఛాయయందు కొంచె మాకుపచ్చను వేయవలసి యుండును. పీ లైన యారంగు నుపయోగించుట యుక్తము.

నీలిబట్టరంగు కొంచెము రక్తవర్ణముగను, రక్తవర్ణమిశ్రిత మైనసిపియాగను ఉండును. ఊదామిశ్రిత మైన నీలిబట్ట ఛాయ నారింజరంగుగ నుండును. కొంచెము ఛాయయున్నచోటులయందు కోబాల్టు ఉపయోగపడును. నల్లనిలేసుయొక్క ఛాయయందు గాఢ మైననీలి కలిసియుండును.

నల్లనిబట్టలకు, సిపియాను, క్రిమిజనులేకును, ఇండిగోరంగును కలిపి వేయుదురు.

పసుపుపచ్చనిబట్టలఛాయకు బరంటుశియనాను, వేండిక్కుబ్రౌనును ఉపయోగింతురు. బట్టకు వేయుటకు గెంబోజిని ఇండియాపసుపును ఉపయోగించుట మంచిది.

వెనుకభాగము :—వెనుకభాగములు సులభముగ చిత్రించవచ్చు నని యిదివరకు చెప్పి యుంటిని. సాధారణముగ వీటిని చిత్రించుట సులభమే. కాని యిందు ప్రవీణత కలుగఁజేసికొనుట కష్టము. సర్ జోషువా రేనాల్డ్సు దొరగారు చిత్రము నంతను శిష్యులచేత వ్రాయించి వెనుకభాగములనుమాత్రము తామే చిత్రించుచు వచ్చిరఁట. ముఖమును బాగుగ చిత్రించుట వచ్చిననేకాని యీవిషయమై విద్యార్థులు తలపెట్టరాదు. కాని వారిసహాయార్థమై యిందు కొన్నియంశములను పొందుపఱుచుచున్నాను.

ముఖమే చిత్రమునందు ప్రధానము. అందువలన నీవెనుకభాగములు ప్రకాశమాన మైనరంగులతో చిత్రించరాదు. ఇటుల చేసినయెడల చిత్రముయొక్క ప్రాముఖ్యము తగ్గిపోవును. ఒకేవిధ మగురంగుతో దీనిని చిత్రించరాదు. వివిధ మైనరంగులను కలిపి మోటుగా పూయుట మంచిది. ఈరంగు కొన్నిభాగములయందు దట్టముగను, కొన్నిచోట్ల పలుచగను వేసినయెడల చిత్రమువెనుక నేదో యొకరంగు కాగిత మంటించినటుల కానరాదు.

చిత్రమువెనుక నేదైన ప్రదేశచిత్రము వ్రాసిన, అం దుండువస్తువులు తక్కువగా నుండవలెను. వీటికి గాఢమైనరంగులను వేసి ప్రాముఖ్యము నివ్వకూడదు. ఈవిషయము ప్రవేశచిత్రపటములయందుకూడ పనికివచ్చును. ఇట్టి సమయమునందు ఆకాశపురంగు ఎఱుపుసంబంధ మైనదిగ నుండిన మంచిది. వేండిక్కును రీనాల్డ్సును వారిచిత్రముల వెనుకభాగములయందు ప్రదేశచిత్రములనే విశేషము చిత్రించిరి. ప్రధానచిత్రమునందు గాఢ మైనరంగులను వేసి యుండిన వెనుకభాగములకుఁగూడ కొంచెము దట్ట మైనరంగులను వేయవలెను. ఛాయ ముఖమునందు దట్టముగ లేనియెడల వెనుకభాగమునకు కొంచెము తేలికరంగు వేయుట మంచిది.

వెనుకభాగములకు నీలిని, ఎఱుపును పలుచగ వేయవచ్చును. ఎఱుపు వెనుకభాగమునం దుండునటుల చిత్రించుట యిందు చెప్పెదను. వెనుకభాగమునందు ఎఱుపువస్త్ర ముండినటుల వ్రాయవలె ననిన, ప్రధాన మైనముడుతలను, ఛాయను సిపియాతో మొదట చిత్రించి, పిమ్మట కావలసినను ఎఱుపును పలుచగ వేయవలెను. ఇది బాగుగ నారినపిమ్మట గెంబోజపసుపును పలుచగ వేయుము. ఛాయను, ముడుతలను, సిపియాతోను, అలిజనులేకుతోను వేండిక్కుబ్రౌనుతోను బాగుగ కనుపడునటుల చేయవలెను. పిమ్మట నీరంగులపై సిపియాను వేండిక్కుబ్రౌనును వేసి చక్క చేయవలెను.

వెనుకభాగమునకు నీలిరంగును వేసినయెడల ముఖముయొక్క ప్రాముఖ్యము తగ్గిపోవును; కాని యీరంగుయొక్క గాఢమును, యిండియా యెఱుపుతోను, సిపియాతోను తగ్గించవచ్చును.

పసుపుపచ్చనిరంగును వెనుకభాగమునకు వేసి, బరంటుశియనారంగుతోను, వేండిక్కుబ్రౌనురంగుతోను, సిపియాతోను ఛాయ నివ్వవలెను. పసుపురంగుయొక్క ప్రాముఖ్యమును తగ్గించవలె నన్న నీలిని వేయరాదు. ఇటుల వేసినయెడల అంతయు ఆకుపచ్చ నైపోవును. నీలితో కొంచె మెఱుపును కలిపి ఉపయోగించవచ్చును.

వెనుకభాగములయందు ప్రదేశచిత్రమును వ్రాయవలె నన్న దూరముగ నుండుస్థలమును, ఆకాశమును, కోబాల్టునీలితో చిత్రించవచ్చును. మేఘములకు తేలిక యైనఎఱుపురంగును, నీలిని, ఇండియాయెఱుపును పూయవచ్చును. దగ్గరనున్నస్థలములకు సిపియాను, ఇండిగోరంగును వేయవచ్చును. దూరముగ నున్నచెట్లకు పసుపును,

తుప్పలకు గెంబోజియును వేయుట మంచిది. దగ్గర నున్నచెట్లకు ఆకుపచ్చను, బరంటుశియనారంగును వేయుట యుక్తము గాఢ మైనఆకుపచ్చ నెంతమాత్రము నుపయోగించరాదు.

మార్పులు, దిద్దుబాట్లు:—రంగులను వేయుటయం దనేకతప్పులకు లోనౌదుము. అందువలన దిద్దుట యనవసరము. కావలసినచోట్లయందే దిద్దవలెను కాని అనవసరముగ నీపనిని చేయరాదు. ఇటుల చేసినయెడల కాగితము చెడిపోవును. చిన్నదిద్దుబాటేమైన నున్నయెడల చిన్నతడిగుడ్డతో నైనను, రొట్టెతో నైనను చెఱుపవచ్చును. ఈపనిని చేయునప్పుడు కాగితము కరకుగా నైపోయినయెడల గోరుతో నదిమిన నున్న నైపోవును. విస్తారము దిద్దుబాట్లున్నయెడల సముద్రపుపాచి (Sponge) నుపయోగించుట యుక్తము. చెరుపునప్పుడు ఇతరస్థలములయందు ఈపాచి తగిలి చిత్రము చెడిపోవును. కనుక ఎంతవఱకు చెరుపవలయునో అంతవరకు మఱియొకవ్రాయింగుకాగితముపై కన్నము చేసి దాని నాస్థలమునం దుంచి తడిపాచిముక్కతో దానిపై వ్రాయవలెను. చిత్రముపై నొక్కచోటునసే దీనిని విస్తారముసే పుంచరాదు. పాచియందు విస్తారము జల ముండరాదు చెరిపినచోటున మఱియొకమారు చిత్రించవలె నన్న నిదివరకు చెప్పినపద్ధతి ననుసరించవలెను. స్పాంజితో చెరుపునప్పుడు కాగితము చెడిపోవచ్చును. అట్టి స్థలమునందు రంగులు వేయుట కష్టము. ఈస్థలమును బాగుచేయుటకు మఱియొక్క పద్ధతి యున్నది. చెడిపోయిన చోటును మంచియిసుకకాగితముతో (Sand Paper) మెల్లగ వ్రాసినయెడల కాగితమునకు తొలిసొంపు వచ్చును.

చిన్నతప్పులను దిద్దుటయందు స్పాంజితోను, తడిగుడ్డతోను, రొట్టెతోను తుడుచుటకంటె జాగ్రత్తతో నచ్చోట తెలుపును వేసిన చాలును. ఈరంగు బాగుగ నారినతరువాత దీనిపై మీాయిష్టమువచ్చినరంగులను వేయవచ్చును.

సమాప్తము:—పైనచెప్పిన వన్నియు బాగుగ తెలిసియుండవలెను. వీటిని కంఠపాఠము చేయు మని నాయుద్దేశముకాదు. ఈచిన్నగ్రంథమును దగ్గర పెట్టుకొని యిందు చెప్పియున్నప్రకారము చిత్రించుచున్నయెడల నదియే యలవడును. పిమ్మట నీవే స్వతంత్రుఁడవు కానచ్చును. అభ్యాసము చేసినకొలఁది నిపుణత్వము ఎక్కువ కాఁగలదు. గొప్పచిత్రకారులు వ్రాసి పూర్తిచేయునటునంటిచిత్రములను చూచి మనము విస్తారము నేర్చుకొనఁగలము. సుప్రసిద్ధ చిత్రకారుఁడు చిత్రించుటను చూచుటకంటె యీవిషయమున భాగ్యము కలదా? ఇట్టివి చూచుటవలన పూజ్యు లగునాపురుషులు ఎటుల రంగులను వేయుచుండిరో మనకు విశద మగును.

వివిధతరగతులయం దుండుచిత్రములను జాగ్రత చేసికొని వాటిసహాయముద్వారా రంగులను నేర్చుకొనుట మంచిది. ఎప్పట నైన తెలియకపోయినయెడల కొంచెము వాటివైపున దృష్టిని నిగిడించిన చాలును. కష్ట మంతయు తొలగిపోవును.

ఇంతటితో నీవిషయమును చాలింతము.



## ఐదవ భాగము.

### వివిధాంశములు.

నిలిచియున్ననీరు, ప్రతిబింబములు:—నిలిచి యున్ననీటియందు నలువైపుల నున్నవస్తువులు ప్రతిఫలించును. అందు కెరటములు లేనిసమయమున నెన్నియో చిత్రములను చూడ నగును. అట్టిచిత్తరువులను వ్రాయగలవాఁడే ధన్యుఁడు. కాని మనము కొంచెము దూరము నుండి చూచినయెడల నవి యన్నియు కానరావు. గాలివలన చిన్న

కెరటములు పుట్టుచుండును. చేపలు కప్పలు కొంతవరకు నీటినిలుకడను చెరిపివేయును. దీనివిషయమై చెప్పుట కంతగా వీలు లేదు. 35—1 చిత్తరువును చూచిన గొంతవఱకు బోధపడును.
















35

వాయువు నెమ్మదిగ నున్నపుడే నీరు నిలుకడగ నుండును. కాన నిట్టినీటిప్రదేశమును చిత్రించునపుడు గాలి వేయుచున్నటుల వ్రాయుట గొప్పతప్పిదము. ఇట్టినీటిపై ననేకపులుగు లెగురుచుండును. మధ్యమధ్య గడ్డి మొలచియుండును. కొంగలు నిలఁబడి యుండి యాహారమునకై బకధ్యానము చేయుచుండును. ఇట్టివస్తువుల పేరులను వేనవేలు వ్రాయవచ్చును. కాని తుదకు లాభము లేకపోవును. ఇదివరకు చెప్పిన ప్రకారము విద్యార్థి తన డ్రాయింగు పరికరములతో నిట్టిస్థలములకు పోయి వ్రాయుచుండుటయే యుత్తమము. అభ్యాసమువలనను, అనుభవమువలనను అనేకవిషయములను నేర్చుకొనవలెను.

సముద్రపుకెరటములు :—ఈకెరటములు సదా భూమిపైకి దొర్లుచుండును. సాధారణముగ నివి సౌందర్యముగ నుండును. కాని వీటిముఖమున గాలి వీచుచున్నయెడల అనేకవిధము లగునాకృతులను దాల్చుచుండును. సముద్రతీరపుస్థితినిబట్టి యివి చాలవరకు మారుచుండును. 35—2 చూడుము.

సముద్రము పోటెక్కినపుడు కెరటముల కేమైన నడ్డు వచ్చినయెడల నవి మిక్కిలి యెత్తుగ లేచును. సాధారణముగ కెరటములు పండ్రెండడుగులకంటె యెత్తుగ లేవవు. కొన్నిసమయములందు కెరటములవలన తుప్పరలు మిగుల నెత్తులేచును. అప్పుడప్పు డీజలబిందువులు వర్షమువలె కానవచ్చును. సముద్రమునందు తుపా నున్నయెడల నిట్టివి చూడనగును.

మేఘములు :—మేఘము లనేకవిధములు. వీటిలో కొన్నిటికి సిర్రసుమేఘములు (Cirrus), క్యూములను మేఘములు (Cumulus), స్ట్రేటసుమేఘములు (Stratus), సిర్రోక్యూములనుమేఘములు (Cirro Cumulus) క్యూములోస్ట్రేటసు మేఘములు (Cumulostratus), నింబను (Nymbus) మేఘములు అందురు.

ప్రతిప్రదేశచిత్రమునందును మేఘములు ముఖ్యము. అందువలన వీటివిషయమై బాగుగ తెలిసి యుండవలెను. ఈమేఘములు మనుజులహృదయములయందు ఆశ్చర్యము నెలకొల్పును. వీటిని ప్రకృతి ననుసరించి చిత్రించుట నేర్చుకొనవలెను.

సిర్రసుమేఘములు అన్ని మేఘములకంటె మందమైనవి. ఇవి చాలయెత్తుగాను, సన్నముగాను, పొడవుగను, తెల్లగను నీలిరంగు ఆకాశమునం దివి కానవచ్చును. ఏకముగ నుండక విడివిడిగా సమాంతరములుగ నుండును. కొన్ని సమయములయందు ఇవి సమకోణములుగ కలసికొనును. ఆకాశపుభావిస్థితి నెమ్మదిగ నుండునపుడు ఇట్టిమేఘములు కానవచ్చును. ఇవి కానబడునప్పుడు మందమైనగాలి వీచి హృదయమును రంజింపఁ జేయుచుండును.

క్యూములసుమేఘములు సిర్రసుమేఘములకంటె కొంచెము దట్టముగ నుండును. గాలితో నివి కదలుచుండును. వర్షచిహ్నములు కానవచ్చునప్పు డివి విడిపోయి ముద్దలుముద్దలుగ నున్నటుల కానవచ్చును.

స్ట్రేటసుమేఘములు భూమికి చాల దగ్గరగ నుండును. ఇవి యేకముగ కనఁబడును. గుండ్రముగాను, పొరలు పొరలుగాను ఇవి యున్నటుల కానవచ్చును. ఎండాకాలమునందే యివి సాధారణముగ కానవచ్చును. అప్పుడప్పుడు చలికాలమునందు కూడ కానవచ్చును. ఈమేఘములు కానవచ్చునపుడు పెద్దగాలి సాధారణముగ వచ్చును.

క్యూములోస్ట్రేటసుమేఘములు మిక్కిలి భయంకరములుగ కానవచ్చును. ఇట్టిమేఘములను చూచినప్పు డెవరి మనములు వేదాంతసంబంధమైనయూహాలతో నిండకుండును? వీటిఅంచులు తెల్లగ నుండును. అందువలన మంచుతో కప్పఁబడినపర్వతసమూహములవలె కనఁబడి హిమాలయపర్వతములను జ్ఞప్తికిఁ దెచ్చును.

నింబసుమేఘములను వర్షమేఘము లని పిలుచుటయం దేమియు నతిశయోక్తి లేదు. ఇవి వేగముగ నాకాశము నావరించి ప్రపంచము నంతను కాంతివిహీనముగ చేసివేయును. అంతకంత కివి యభివృద్ధి నొందును. వెంటనే మెరుపులతోను, ఉరుములతోను, భయంకరముగ వర్షించును. వర్షాంతమునం దివి వెంటనే మాయమైపోవును. ఇట్టివాటిని మీ రనేకపర్యాయములు చూచియే యుందురు. పైఁజెప్పినమేఘము లెప్పుడైన మీకు కనఁబడినయెడల వెంటనే వాటిచిత్రములను వ్రాసి పదిలపఱచియుండవలెను. ఎప్పటికైన నీచిత్రములు పనికివచ్చును.

గాలులు :—గాలులు మనకు కానరావు. ఇవి మనకు చాల ఆవశ్యకమైనవి. ఇవి వీచి, యిండ్లు చెట్లు మొదలుగాఁగలనిర్మాణముల నన్నిటిని పాడుచేయుచుండును. గాలిని చిత్రమునందు చూపలేము కాని అది చేసినట్టియు చేయుచుండినట్టియు పనిని చూపఁగలము. చెట్లు విరిగిపోయినట్టును, విఱుగుచున్నటులను, విరిగిపోఁబోవుచున్నటులను, ఆకులు మొదలగునవి యెగురుచున్నటులను, బట్టలు గాలియందు కొట్టుకొనుచున్నటులను, వ్రాసినయెడల గాలి వీచుచున్నటుల వెంటనే విదిత మగును కాని గాలి యొకేవైపునకు వీచుచుండును. అందువలన సృష్టియందుండు వస్తువు లన్నియు నొకేవైపునకు వాలియుండును. సుడిగాలులు బహువిచిత్రముగ నుండును. ఆకులు, యిసుక, యింక దానియావరణమునకు వచ్చినవస్తువులు మీఁది కెగిరిపోవును. ఎడారులయందు సుడిగాలి వీచుసమయమున యిసుకస్తంభములు లేచుచుండును. ఇరువైపులనుండి రెండు సమానబలము గలగాలులు వీచునప్పు డిట్టివి సంభవించును.

సైమూనుగాలులు అరేబియాయందు విస్తారము ప్రబలును. ప్రారంభమున నాకాశము నిర్మలముగ నుండును. సూర్యుడు తీక్ష్ణముగ ప్రకాశించును. ఈసైమూనుగాలి వీచుచు దానితో యిసుకను తీసుకొని పోవుచుండును. ఇవి చాలవరకు విషవాయువులు. వీటిబారినుండి తప్పించుకొనుటకు మనుష్యులు భూమిమీఁదను పండుకొనెదరు. ఒంటెలు వాటిమూతులను ఇసుకలోఁ దూర్చివేయును. చలికాలమునం దీగాలులు చల్లగనుండును. ఇట్టిగాలులను ప్రదర్శింపవలె నన్న, ఇసుక యెగురుచున్నటుల, మనుజులు, ఒంటెలు, యిసుకమీఁద చచ్చి పడియున్నటుల వ్రాయవలెను.

అగ్నిపర్వతములు :—ఇవి నిజముగ పర్వతములు కావు. అగ్నిచే చేయఁబడలేదు. భూమియొక్క అంతర్భాగమున కొన్నిమార్పులు కలిగి అనేకవస్తువులు ద్రవరూపముగ మాఱి భూమిని పగుల్చుకొని, పైకివచ్చి యెత్తుగ లేచును. ఆపదార్థములే నలువైపుల పడును. అందువలన చుట్టును భూమి యొకపర్వతాకారమును దాల్చును. ఈఅగ్నిపర్వతములు విజృంభించునపుడు దగ్గర కెవరును వెళ్లఁజాలరు. 35—3 చూడుము.

ఎల్లసమయములయందు నిది యిట్టిస్థితియం దుండదు. కొన్నిసమయములయందు చల్లారి నల్లనిపొగమాత్రము వచ్చుచుండును. మఱికొన్నిసమయములయం దీపొగకూడ రాదు. అట్టిసమయమునందు మనము వెళ్లి దాని కన్నము ద్వారా చూచినయెడల, అన్నివస్తువులు కరిగి అగ్నిప్రవాహమువలె ప్రవహించుచున్నటుల చూడఁగలము. దీనిని చిత్రించునపు డెఱుపును నలుపును విస్తారం ముపయోగపడును.

వేఁడినీటియూటలు చూచుట కగ్నిపర్వతములవలె కానవచ్చును. కాని యిందు రాళ్లు, పొగ మొదలగునవి పైకి రావు. వేఁడినీళ్లుమాత్రము పైకి లేచుచుండును.

వర్షము :—వర్షమునందు దగ్గర నున్నవస్తువులు కొంచెము కానఁబడుచుండును. దూరముగ నున్నవి కానఁబడవు. గాలి వీచును. చెట్లు వంగియుండును. దేశమంతయు నీటిమయ మైయుండును. జంతువు లన్నియు తడిసిపోవును. మనుజులు గొడుగులు వేసికొని పడిపోవుదు రేమో యనుభయముతోను, బట్టలు తడిసిపోవు నేమో యను భీతితోను అతిభయముగ నడచుచుందురు. ఆకాశమంతయు భయంకర మై మేఘావృత మై యుండును. చీకటి క్రమ్మియుండును. ఇట్టిచిత్రమును వ్రాయు టతికష్టము. బాగుగ నభ్యాసమైననేగాని యిట్టివాటిని చిత్రించుటకు పూనుకొనరాదు.

ఇంద్రధనుస్సు యిట్టిసమయములయందు కానవగును. ఇందు రంగు లెటులవె నుండునో యిదివరకే చెప్పియుంటిని. దానిప్రకారము నిపుణతతో చిత్రించవలెను. ఇం దేమియు చెప్పుటకు వీలులేదు. చెప్పిన లాభము లేదు. అందువలన విద్యార్థులు ఆకాశమునం దీయింద్రధనస్సును చూచి వ్రాయుట యుక్తము.

సూర్యుఁడు :—భానుఁడు లోకబాంధవుఁడు. ఈతఁడు లేనియెడల లోకమంతయు నంధకారబంధుర మైయుండును. జీవరాసు లన్నియు చనిపోవును.

సూర్యునివెలుతురు, ప్రకృతిని చాలవఱకు మార్చివేయు ననియు, సూర్యుఁడు ప్రకాశించునప్పుడు ప్రదేశచిత్రములను వ్రాయుట కష్ట మనియు నిదివరకే చెప్పితిని.

ప్రస్తుతము సూర్యుని చిత్రించుటను నేర్చుకొందము. 35—4లో చూపిన విధముగ చిత్రింపవలెను.

దీని కుపయోగించురంగులు.

(1) తెలుపు, పసుపు, ఎఱుపు.
(2) కొంచెముపసుపు, తెలుపు.
(3) తెలుపు, వెర్మిలియను, కోబాల్టు.
(4) కొంచెమువెర్మిలియను, విస్తారము కోబాల్టు.
(5) కోబాల్టు, ఉల్ట్రమైను.

సూర్యబింబమునకు విస్తారము తెలుపు.

ఇంద్రధనుస్సువలెనే దీనిని జాగరూకతతో చిత్రింపవలసియుండును.

దూరముగనుండుసముద్రముయొక్క రంగును, సూర్యునియొక్క రంగును ఒకేవిధముగ నుండును. ఇరువైపులు నుండుజలభాగమునకు నలుపును, ఇండిగోరంగును, కోబాల్టును, బరంటుశియనారంగును వేయవలెను. ఆకుపచ్చమాత్రము విస్తారము వేయకూడదు.

సూర్యోద్భవమును, సూర్యాస్తమయమును, 35—5 లో చూపిన విధముగ చిత్రింపవలెను.

దీని కుపయోగించురంగులు:—

(1) కొంచెముఆకుపచ్చ, నీలి.
(2) కోబాల్టును, కొంచెముక్రిమిజనులేకును, బరంటుశియనారంగు.
(3) విస్తారముకోబాల్టు, కొంచెము ఇతరరంగులు.
(4) ఇంక విస్తారము కోబాల్టు, చాలాకొంచెము ఇతరరంగులు.
(5) గ్రేవర్ణము, కోబాల్టు, క్రిమిజనులేకు, బరంటుశియనారంగు.
(6) క్రిమిజనులేకు, వెర్మిలియనువర్ణము.

ఇట్టిసమయమునందు ఆకాశమునకు వివిధ మైనరంగులు వచ్చును. దీనిదగ్గర నున్ననీటియం దీరంగులు వేయవలెను. కాని కొంచెము పలుచగ వేయుట యుక్తము.

ఆకాశమునకును, నీటికిని, పనికివచ్చురంగులు:—కోబాల్టు ఆకాశమునకును, సముద్రమునకును వేయుటకు మిక్కిలి యుపయోగపడును. ఇది ఆరినతరువాత నీరంగును మార్చుటకు చిందూరరంగును, కావిరంగును వేసిన చాలును.

నీలివర్ణము బ్రౌనుమేడరురంగులోను, కావిరంగుతోను కలిపి నీటికి వేయవచ్చును. పసుపుతో కలిపినయెడల తుపానుసమయమునందు ఆకాశమునకు వేయుటకు పనికివచ్చును.

ఇండిగోరంగును నలుపుతో కలిపిన రాత్రులయందు కానవచ్చు మేఘములకును, దూరముగ నుండుపర్వతములకును, పనికివచ్చును. బ్రౌనుమేడరురంగుతో కలిపిన రాత్రులయందు కానవచ్చునీటికి పూయవచ్చును. బ్రౌనుమేడరురంగుతోను బరంటుశయనాతోను, కలిపిన గాఢ మైనరంగుగలరాళ్లకు వేయవచ్చును.

బ్రౌనుమేడరురంగును, కోబాల్టుతోను, వేండిక్కు బ్రౌనురంగుతోను కలిపిన దూరమున నుండువస్తువులకు వేయవచ్చును. నీలిరంగుతోను, బరంటుశయనారంగుతోను కలిపిన చాయను వేయుటకు పనికివచ్చును.

వెర్మిలియనువర్ణము, ఉదయపు సాయంకాలపు ఆకాశములకు పనికివచ్చును. గోపిచందనపురంగుతోను, కోబాల్టుతోను కలిపినయెడల తుపానుఆకాశముకు వేయవచ్చును. గాఢముగ నుండుమేఘములకు లైటురెడ్డును కలిపిన చాలును. దూరముగ నుండుగృహములకు చిందూరవర్ణమును, బరంటుశయనారంగును, బ్రౌనుమేడరురంగును ఈరంగుతో కలిపి వేయవచ్చును. తేలిక యైనఎఱుపురంగును కోబాల్టుతో కలిపినయెడల మేఘములకు పనికివచ్చును. ఈరంగుపై బరంటుశయనారంగును వేసినయెడల గాఢత తగ్గును. ఇండిగోరంగుతో కలిపిన ఛాయకు పనికివచ్చును.

గోపిచందనపురంగు ఆకాశమునకును, పడవలకును, ఇండ్లకును, పనికివచ్చును. ఇతరరంగులతో కలిపినయెడల చెడిపోవును. అందువలన నితరరంగులపై నిద్దానిని పలుచగ వేసుకొని రావలెను.

బరంటుశయనారంగు రాళ్లకును, బురదకును, ఇండ్లకును, వేయుట కత్యంతోపకారిగ నుండును. వీనితో కలిపిన మంచిఆకుపచ్చవర్ణము లభించును. కోబాల్టుతో కలిపిన చక్కనిరంగును, నీలితోకలిపిన గాఢ మైనరంగును వచ్చును. న్యూట్రల్ టింటుతో కలిపిన అనేకవిధముల నుపయోగపడును.

బ్రౌనుమేడరురంగును కోబాల్టుతో కలపిన నీడ కుపయోగపడును. ఇండిగోరంగుతో కలిపిన దగ్గరనున్న వాటిఛాయ కత్యంతోపకారిగ నుండును. న్యూట్రలుటింటుతో కలిపిన గాఢ మైననీడను చిత్రించుటకు పనికివచ్చును. ఎఱుపుతో కలిపిన ఛాయకును దూరముగ నుండుఎఱుపుబావుటాలకును, దగ్గరగ నుండు ననేకవస్తువులకును వేయుట కుపయోగపడును.

సిపియాను మసిరంగుతోను (Lamp Black) బ్రౌనుమేడరుతోను కలిపిన ప్రదేశచిత్రములయందు పనికివచ్చును.

మసిరంగును బరంటుశయనాతోను బ్రౌనుమేడరురంగుతోను కలిపి ప్రదేశపటములయం దుపయోగించెదరు.

పైరంగులను విద్యార్థులవిషయమై చెప్పితిని. మంచిఅభ్యాసముగ వారు ఇంక నెక్కువరంగుల నుపయోగించెదరు. కాని వారుకూడ ఈరంగులతోనే అభ్యసించి అనుభవశాలు లైరి. చిత్తరువులను కొలదిరంగులతోనే చిత్రింపవచ్చును. అందువలన సాధ్య మైనంతవరకు విద్యార్థులు తక్కువవర్ణములనే యుపయోగించెదరు.

చెట్లకు పూయు రంగులు :—దూరముగనుండు చెట్లకీవిధముగ రంగు పూయుదురు.

1. కోబాల్టుతోను, సిమ్మపండువన్నెముతోను పూసి, కోబాల్టుతోను, గోపిచందనపురంగుతోను ఛాయ నివ్వవలెను.

2. కోబాల్టును, గోపిచందనపువన్నెమును, గులాబిరంగును కలిపి పూసి, కోబాల్టుతోను, గెంబోజితోను, ఛాయనిచ్చుట మంచిది.

3. కోబాల్టుతోను, ఇండియాపసుపుతోను, చిత్రించి, కోబాల్టును, రాఅంబరును, (Row Umbur) ఛాయ కుపయోగించెదరు.

4. కోబాల్టును, గెంబోజని, గులాబిని వేసి, కోబాల్టుతోను, బ్రౌనుమేడరురంగుతోను, ఛాయను చిత్రించెదరట.

5. పరానుసీలితోను, గోపిచందనమురంగుతోను, చిత్రించి, పరానుసీలిని, గెంబోజని, బ్రౌనుమేడరురంగును ఛాయ కుపయోగించెదరు.

దగ్గఱనుండు చెట్లకు వేయు రంగులు.

1. ఇండిగోరంగును, గెంబోజని, క్రిముజనును వేసి నీలితోను, గెంబోజితోను, బరంటుశియనాతోను ఛాయనిచ్చెదరు.

2. నీలిని, గోపిచందనమురంగును వేసి నీలిని, ఇండియాపసుపును ఛాయ కుపయోగింపవలెను. లేసియొపల నీలిని, బరంటుశియనారంగును ఛాయకు ఉపయోగించవచ్చును.

3. ఇండిగోరంగును, గెంబోజని వేసి ఇండిగోరంగును, ఇండియాపసుపును ఛాయనిచ్చుటకు సాధారణముగ నుపయోగించెదరు

సాధారణముగ చెట్లకీదిగువరంగులు ఉపయోగించవచ్చును.

1. ఇండిగోరంగుతోను, గోపిచందనమురంగుతోను చిత్రించి, ఇండిగోరంగుతోను, బరంటుశియనారంగుతోను ఛాయనిచ్చెదరు.

2. ఇండిగోను, గెంబోజని, బరంటుశియనారంగును వేసి ఇండిగోను, గెంబోజని, బ్రౌనుమేడరురంగును ఛాయను చిత్రించుట కుపయోగించెదరు.

3. ఇండిగోను, గులాబిమిశ్రితమైన బరంటుశియనారంగును వేసి, పరానుసీలితోను, గులాబిమిశ్రితమైన బరంటుశియనారంగుతోను, బ్రౌనుమేడరురంగుతోను ఛాయనిచ్చెదరు.

సంపూర్ణము.

